REGD. No. M. 4793

గృహలక్ష్మి

15th May 1949





By Courtesy "Jayakeralam"

VOL. 18

# GRIHALAKSHMI

NO. 5

PRICE AS. 6.



# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక


సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి


# GRIHALAKSHMI


మే, 1949.

సంపుటము ౧౮] [సంచిక ౫




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువ మేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:

—(★)—

గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్‌డిపో.
బెజవాడ: మాదరక్ష న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యం. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం సూరరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనల బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూరరాజు.
బరంపురం: కె. వి. రంగారావు
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. రంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
అనకాపల్లి: పి. వీరునాయుడు,
విజయనగరము: పి. నారాయణప్పడు.

భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి: బి. ఆంజనేయులు.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్శిపట్నము: సి. రామం.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్: ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్: నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్‌రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం: వి. వి. రంగాచారి
డోర్నకల్లు: కె. జె. జి. సుందరం.
చోడవరం: పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి: ఆర్. చంచల్‌రావు
చీరాల. పి. సూర్యనారాయణ

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.

# వి ష య సూ చి క



---

గతసంచికలో 246 పుటలో ప్రశ్నకు జబాబు — ౧౦౧.



నీలాటి రేవులో, నీలాలకా!

ఏ మధురస్మృతులలో మైమరచినావు?




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# కేసరీపాఠశాలల వార్షికోత్సవము

ఆచారానుసారము కేసరీపాఠశాలల వార్షికోత్సవమున్నూ స్థాపకులగు శ్రీ కేసరి గారి జన్మదినోత్సవమున్నూ గతమాసంలో జయప్రదంగా జరిగినందుకు సంతసిస్తున్నాము.

ఈ సందర్భంలో పాఠశాలల పరిపాలక సంఘాధ్యక్షులు శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు శ్రీ కేసరిగారి తైల వర్ణచిత్రపటమును పాఠశాలల కర్పించడం ఎంతైనా ఒప్పియున్నది. ఇందుకు వారి నెంతయు అభినందిస్తున్నాము. ఈ చిత్రపటమున శ్రీ కేసరి గారిని మూడుమూర్తులా ఉట్టిపడట్టు చిత్రించిన సిద్ధహస్తులగు శ్రీ చామకూర్ గారి కళానైపుణ్యము గణనీయము. ఇట్టి చిత్రములెన్నియో, వారి కీర్తికుశలతలను చిరకాలం స్థిరంగా చాటుతుంటాయి. ఈ చిత్ర మీవిద్యాలయమందు శిక్షణపొందే విద్యార్థినీ విద్యార్థుల హృదయకమలములందు సుచిత్రితమై కలకాలము వారిని కేసరిగారివలెనే కార్యదక్షులుగను, సంపాద్యపరులుగను, తనివిదీర త్యాగభోగపరాయణులుగను చిరంజీవులుగను గావించుగాక.

అధ్యక్షతవహించిన శ్రీ గా. రా. జా. బి. రామకృష్ణరాజుగారును, చిత్రపటావిష్కరణ మొనర్చిన శ్రీ బులుసు సాంబమూర్తిగారును, సభోపక్రమణ మొనర్చుచు శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారును, చిత్రపటము స్వీకరించుచు శ్రీ జస్టిస్ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారును, తమకృతజ్ఞత తెల్పుచు కేసరిగారును పల్కిన శుభవాక్యములు, హితోపదేశములు పాఠశాలలకెంతయు అభ్యుదయకరములు.

నేడు, చెన్నపురి, ఏర్పడగల ఆంధ్రరాష్ట్రముతో ఎట్టి సంబంధముకలిగియుండునదేది నిర్ణయక్రమమున నుడివడియున్నది. అది యెట్టిదైనను—చెన్నపురిలోగల అసంఖ్యాకులగు తెలుగు బాలబాలికలకు మాతృభాషలో విద్యగరపనేర్పడిన ఈ పాఠశాలల ప్రయోజనమున కంతరాయముకలుగరాదని ఎల్లరాశించుచున్నారు. దాతలగు శ్రీ కేసరిగారి సంకల్పశుద్ధియు, వీనియందు మాతృభాషలో విద్యనేర్చి తెలివొందు బాలబాలికల కిశోరహృదయానందమును ఈ పాఠశాలల భవిష్యత్తునకు సర్వరక్షలై వెలయుగాక. వెం.



# భారతీయ రిపబ్లిక్ — కామన్‌వెల్తు

భారతదేశము సంపూర్ణప్రజాస్వాతంత్ర్యయుతమైన ప్రభుత్వాధికారము (Sovereign Indian Republic) గా నుండడానికి పూర్వ సంబంధీకులైన బ్రిటిష్ కామన్‌వెల్తు రాజ్యాధికార్లు అంగీకరించారు. భారత యూనియన్ ప్రభుత్వం (నెహ్రూ) కామన్‌వెల్తు రాజ్యాలలో సమానసఖ్యభావంతో కలిసి ఉండడానికి సమ్మతించినది. ఈ కూటమికి - బ్రిటిష్ రాజు చిహ్నము ; అంటే పెద్దతల. ఈ పెద్దతలకు ఈ పదవివల్ల యేర్పడ్డ పనేమీ లేదు. భారతదేశపు రాజ్యాంగచట్టంలో ఇతని ఊరూ పేరూ ఉండదు. భారతయూనియను అధ్యక్షుడు, బ్రిటిష్ రాజుతో సమాన స్థాయీగాని హెచ్చుతగ్గులుండబోవు. ఇదైనా ఆస్ట్రేలియా కెనడాలు ఓగులొడిస్తే ఒప్పుకున్నారట!

ఈ కూటమిలో చేరినంతమాత్రాన తప్పనిసరిగా ఇతరులతోపాటు మన మెవ్వరిపైన కత్తికట్టనక్కరలేదు. మన మితర దేశాలలో ఎలావ్యవహరిస్తామనేదానికి ఒకరి సూచన, యోచన పాటించనక్కరలేదు. ఈసంబంధంవల్ల ఆర్థిక సహకారము లభిస్తుంది. దీనివల్ల ప్రపంచశాంతికై పనిచేయడానికికూడా హెచ్చుగా అవకాశం లభిస్తుందిట.

ఇవంతా రాజకీయవేత్తలు తర్కవితర్కాలతో సమన్వయించుకోవలసిన సంగతులు. "గృహలక్ష్మి" తన గృహ రాజకీయాలతో సరిపోల్చి చూచుకుంటుంది. తన కుటుంబ నిర్వహణానికి కావలసిన వస్తువులకై—పూచికపుల్లసహా, ఒకరినాశించవలసిన అవసరం లేకుండా ఉండడం - ఒకటి ; తన ఇంటిసంరక్షణకు ఒకరిని బ్రతిమాలుకోవలసిన అవసరంలేకుండా ఉండడం - రెండు. ఈ రెండూ సమకూరినరోజున కామన్‌వెల్తు సంబంధం ఉన్నా ప్రమాదంలేదు ; లేకున్నా దిగులులేదు.

అంటే, భారతీయులు పనిమంతులై - పరిశ్రమలు విస్తారంగా పెంపొందించాలి; బలవంతులై, భారతదేశముమీద ఎంతటి బలవంతులైనా కన్నెత్తిచూడ వెరచేట్లు చేయాలి. అట్టి బిడ్డలను కని పెంచవలసిన భారము—తల్లిది!

# శ్రీ కేసరీ విద్యాలయ వార్షికోత్సవం

## స్థాపకులగు శ్రీ కేసరిగారి జన్మదినోత్సవము



19-4-49 న ఈఉత్సవాలు రెండున్నూ - మైలాపూరులో కేసరీబాలురపాఠశాలలో మహావైభవంగా జరిగినవి. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు గౌరవనీయులు శ్రీ రాజా బి. రామకృష్ణరాజుగారు అధ్యక్షతవహించిరి. శ్రీ డాక్టరు రాధాకృష్ణన్, జస్టిస్ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, శ్రీ మునగాల రాజా, అల్లాడి కృష్ణస్వామిఅయ్యరు, మాజీ హైకోర్టుజడ్జి బి. సోమయ్య, వేపా రామేశం, పప్పు సోమసుందరం, యనమండ్ర సూర్యనారాయణ, బులుసు సాంబమూర్తి ప్రభృతులు పలువురు సభనలంకరించిరి.

తొలుత కేసరీకన్యావిద్యాలయ బాలికలైదుగురు మృదుమధురకోమలగాత్రముల ప్రార్థనమొనర్పగా సభ ప్రారంభమైనది.

అంతట కీ|| శే గోవిందరాజాచారిగారి స్థానేపాలక సంఘమునకు నియమింపబడిన నూతన సభ్యులు, శ్రీ ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు-సభాసదుల నాహ్వానించి శ్రీ రామకృష్ణరాజుగారి నధ్యక్షతవహింపుడనికోరిరి. వారి ఉపన్యాసక్రమమున వారిట్లుచెప్పిరి:- చెన్నపురిలో తెలుగు బాలబాలికలకు తెలుగుభాషలో విద్యనేర్వను అవకాశములు చాలకుప్తమైయున్న కాలమునందు శ్రీ కేసరిగారు మూడు లక్షలవరకు విరాళమిచ్చి ఈ విద్యాలయములు నెలకొల్పి చెన్నపురి ఆంధ్రులకు వెలలేని సేవచేసి యున్నారు. చెన్నపురిలో దాదాపు నాలుగులక్షలుదాకా తెలుగువారున్నారు. చెన్నపురిలో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర పరిపాలనకు ఏమాత్రము జోక్యముండునో సంశయాస్పదము అగుచున్నది. అది యెట్లైనను, ఈ విద్యాలయములకు ముప్పురాకుండ చూచుకొని మన తెలుగుపిల్లలకు తెలుగులో విద్యనభ్యసించు అవకాశము నిలుపుకోవలసి యున్నది.

## అధ్యక్షుని ప్రారంభోపన్యాసము

ఈ గొప్ప ఉత్సవములలో పాల్గొనుటకు నాకిట్టి అవకాశమునిచ్చినందుకు ఈకమిటీవారికి కృతజ్ఞుడను. ఈనగరమునందుగల అసంఖ్యాకమైన తెలుగు బాలబాలికలకు తెలుగున విద్యనేర్చుటకై అవకాశములు కల్పింపదలచి శ్రీ డాక్టరు కేసరిగారు దాదాపు 3 లక్షలదాకా విరాళమిచ్చి ఈ విద్యాలయములు నెలకొల్పుట మహోత్కృష్టకార్యము. వారి విశాలహృదయమును, ప్రజాహిత చింతనమును మిక్కిలిగా మెచ్చుకొనదగినవి. వారిదాన సాఫల్యార్థము చెన్నపురిలోగల ఆంధ్రులందరును కృషిచేసి ఈవిద్యాలయములు పెంపొందునట్లు చూడవలసియున్నది.

## కార్యదర్శి రిపోర్టు

పిదప పాఠశాలా పరిపాలకసంఘ కార్యదర్శిగారు శ్రీ మైదవోలు శేషాచలపతి పంతులుగారు సాంవత్సరిక నివేదిక చదివి వినిపించిరి. ఈ రిపోర్టు తెలుగునవ్రాసి యుంచుటే సమంజసమైనను అధికారులకు ఆంగ్లమునవ్రాసి పంపుట అవసరము కావున అట్లు వ్రాయబడినది అని చెప్పి రిపోర్టును వివరించిరి. అందలి ముఖ్య విషయములు: కేసరిస్కూలులో విద్యార్థుల సంఖ్య ప్రారంభమున 156; నేడు 398. క్రొత్తగా తయారైన సెకండరీ విద్యా విధానము ఈ పాఠశాలయందమలునందుంచబడినది. స్కూలువిడిచి విద్యార్థులు పాల్గొను ఇతర వ్యాసంగములలో ముఖ్యములు,- రమ్యమగు స్థలములకు యాత్ర వెళ్లుట, ఆలిండియా రేడియో కార్యక్రమముల పాల్గొనుట. 1947 ఏప్రిల్‌లో డాక్టరు కేసరిగారు కేసరీ కన్యా విద్యాలయ మేర్పరుపుమని - లక్షరూపాయల భూరివిరాళము నొక్కసారిగా నిచ్చియుండిరి. ఆ కన్యావిద్యాలయము గత సం||ము నెలకొల్పబడెను. శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబా

విద్యావతీ దేవిగారు ఆ పాఠశాలకు ప్రారంభోత్సవముసల్పి ఆశీర్వదించిరి. ఈ మార్చి నెలలో శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నంగారు పాఠశాలలకు విచ్చేసినప్పుడు రు. 2000/-లను విరాళమిచ్చి సాలుసాలున దానిపైవచ్చు వడ్డీలో సంగీతమున ప్రావీణ్యముగల విద్యార్థినికి బంగారు పతక మిమ్మని కోరినది. ఇత్యాది వివరములను తెల్పిన పిదప కార్యదర్శిగారు నగరమందలి తెలుగుబిడ్డల తల్లి దండ్రులు పోషకులు, పెద్దలు-అందరు పాఠశాలయందును పాఠశాలోద్దేశమునందును గమనముంచి దాని యభివృద్ధికన్ని విధముల తోడ్పడుడని కోరుచు ముగించిరి.

పిదప ఈ సంవత్సరము సంగీతకళకై శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారిచ్చు బంగారు పతకము— కేసరి కన్యావిద్యాలయమున చదువుచున్న చిరంజీవి వసంతకుమారి కొసంగబడినదని ప్రకటింపబడెను.

## శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారి ఉపన్యాసము

తరువాత సభోపక్రమణ మొనర్చుచు, శ్రీ కేసరిగారి చిత్రపటము దాన మొనర్చును - శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారిట్లుపన్యసించిరి:—

శ్రీ కేసరిగారి ఈ తైలవర్ణ చిత్రపటమును నేను సంతోషపూర్వకముగా నీ విద్యాలయమునకు దాన మొసంగుచున్నాను. దీని నింత చక్కగా చిత్రించినవారు శ్రీ చామకూర్ గారు. ఈ నగరమందు చిరకాలముగా తెలుగుబాలుర తెలుగులో పాఠములు బోధించు సౌకర్యములు లేక చాల బాధపడుచుండిరి. దేశభాషలలో విద్యాప్రబోధము జరుగవలయుననే విధానము కొంతకాలముగా అమలులోనికి వచ్చియున్నది. చెన్నపట్నము బహుభాషాప్రాంతము. ఇచ్చట పాఠశాలలో కొన్నాళ్లు అరవముతోపాటు తెలుగులోను బోధ జరుగుచు వచ్చినది. అయితే అట్టిది ద్విభాషా పరిచయులగు ఉపాధ్యాయులవల్ల నడచుచుండేది. ఆ ఉపాధ్యాయులు సామాన్యముగ అరవవారైయుండి తెలుగును నేర్చినవారు. అరవబిడ్డలు, తెలుగు బిడ్డలు కలిసియుండు క్లాసులలో అట్టి ఉపాధ్యాయులు ఉభయవిద్యార్థులకు ఉభయభాషలలో బోధించు చుండిరి. ఆ బోధ ఎంత సౌలభ్యమో, చెప్పువారికిన్ని బోధపడనిభాష తెలుగుబాలురకెంత తెలిసెడిదో చెప్ప తరముకాదు. కడకు తెలుగువారి పసిపాపలకు తెలుగున అక్షరాభ్యాసమునకు అవకాశము మందగించెను. అప్పుడు శ్రీ కేసరిగారు ముందుకువచ్చి, ఈ విద్యాలయములకై వారు అరమరికలులేక 3 లక్షలవరకు ఇప్పటికి విరాళమిచ్చియున్నారు. వారు త్యాగస్వరూపులు. అట్టివారి తైలవర్ణ చిత్రపటమును ఈ విద్యాలయములందు నెలకొల్పుట శ్రేయోదాయకమని యోచించి నేను దీనిని చిత్రింపించి పాఠశాలల కొసంగుచున్నాను.

ఈ విద్యాలయముల అవశ్యకత వేరుగ చెప్పనక్కరలేదు. మాతృభాషలో విద్యాబోధ అత్యవసర మని ఎల్లరు సమ్మతించిరి. ఆవిధానము వేగముగ అమలులోనికి వచ్చినది; వచ్చుచున్నది. అట్టి సమయ మున ఇక్కడ ఈ పట్నంలోగల తెలుగు బాలబాలికలు తెలుగులోవలె అరవములో తమ పాఠములు నేర్వ జాలరు. పాఠశాలలకు ప్రభుత్వము అనేక విధముల సహాయ మొనర్చుచున్నది. ఇట్టి పాఠశాలలకు ప్రభుత్వము అధికముగా సహాయం చేయవలసియున్నది. ప్రభుత్వము తాము నూతనముగ ప్రవేశపెట్టిన మాతృభాష ద్వారా విద్యాబోధనమను విధానము చక్కగా అమలు జరుగుటకు అన్నివిధములా సహాయము చేయుట వారి ధర్మమైయున్నది. ముఖ్యముగా నేను ఆంధ్ర మంత్రులను - ఈ పాఠశాలలను తమవిగా భావింప వలయునని హెచ్చరించుచున్నాను. నగరవాసులగు ఆంధ్రులున్నూ తమ బిడ్డలను తప్పక ఈ విద్యాలయము లకు పంపవలసినదని కోరుచున్నాను. ఆంగ్లప్రభుత్వముతొలిగి దేశీయ ప్రభుత్వములు ఏర్పడి దేశభాషలకు ప్రాముఖ్యత ఏర్పడుచున్నను, ఇంకను కొంతమంది తమ బాలబాలికలను కాన్వెంటుల కంపుచున్నారు. వారందరును తమ పిల్లలను ఈ పాఠశాలలకంపి వీని యభివృద్ధికి తోడ్పడవలయును. ఈ పాఠశాలలలో లోపములుండవచ్చును. ఆ లోపములను పాలకవర్గమునకు తెల్పినచో తప్పక సవరింపబడును. ఇట్లు పాఠ

శాలలకు అన్ని విధములా ఎల్లరు తోడ్పడవలయునని కోరుచున్నాను. ఎవరు తోడ్పడినను తోడ్పడకున్ననూ ఈ పాఠశాలల నవిచ్ఛిన్నముగా ఉత్తమ స్థితిలో నడుపుటకు శ్రీ కేసరిగారు బద్ధకంకణులైయున్నారు.

అప్పుడే సభకు విచ్చేసిన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారిని మచ్చటించవలెనని శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు కోరగా వారిట్లు శలవిచ్చిరి:

## డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి యుపన్యాసము.

నే నిచ్చట ఈ యుత్సవములకు రాగల్గుట దైవికము. కలకత్తానుండి ఇప్పుడేవచ్చినాను; మరలా బొంబాయివెళ్లుచున్నాను. డాక్టరు కేసరిగారిని నాకు 30 సం॥ లుగా తెలియును. ఆయన అనేకధర్మకార్యములగావించియున్నారు. "గృహలక్ష్మి" నెలకొల్పి స్త్రీలకు పత్రికాప్రచారము సాగించుచున్నారు. అనేకవిద్యాసంస్థలకు విరాళములిచ్చియున్నారు. ఈ పట్నములో తెలుగుబాలబాలికలకు తెలుగులో విద్యాబోధనమొనర్చు విద్యాసంస్థలులేని లోపమును కనిపెట్టి ఈవిద్యాలయములను లక్షలాదివిరాళమిచ్చి నెలకొల్పి నడుపుచున్నారు. ఇందుకు వారినెంతయు అభినందించుచున్నాను. వారు నెలకొల్పిపోషించుచున్న ఈవిద్యాసంస్థలు దినదినాభివృద్ధిచెందునని ఆశించుచున్నాను.

## శ్రీ సాంబమూర్తిగారి ఉపన్యాసము.

సభాసదుల కరతాళధ్వనుల్మధ్య శ్రీ సాంబమూర్తిగారు కేసరిగారి చిత్రపటమునావిష్కరించి ఇట్లుపన్యసించిరి:-

ఈచిత్రపటము నింతటి జీవకళలతో చిత్రించిన శ్రీ చామకూర్ గారికి ధన్యవాదములు. అనవసరమనితోచినదానికి కానీయు జారవిడువని కాఠిన్యమును, అవసరమని నచ్చినవానికి లక్షలు కురిపించగల విశాలమైనహృదయమును-చక్కగా వ్యక్తీకరించుచు శ్రీ కేసరిగారి గంభీరమూర్తి ఇందు చిత్రింపబడినది. దారిద్ర్యమునుండిస్వయంశక్తివల్ల లక్షలార్జించి భోగించి ఇట్టి ఉత్తమ సంస్థలకై లక్షలువిరాళమిచ్చిన శ్రీ కేసరిగారి అతిశయము ఎంతైనా ఎన్నదగినది. వారంటే నాకు గొప్పఅభిమానము, గౌరవము. అల్లాడి కృష్ణస్వామయ్యగారు మంత్రులు సహాయ్యము చేయవలయునని కోరియున్నారు. నిజమే; రాజ్యాధికారములేనిది భాషాపోషణముజరుగదు. కాని ఆ రాజ్యాధికారమును అరవలకు విడిచి తెలుగువారు వెళ్లిపోవాలంటున్నారు. అట్లా విడిచిపోరాదు. మద్రాసు నగరపరిపాలనలో ఆంధ్రులకు అధికారమున్ననాడే ఇట్టిసంస్థలకు ప్రభుత్వసహాయము లభ్యపడగలదు. అందుచే ఈ సంస్థల పురోభివృద్ధిగోరువారు అందులకై కూడ కృషి చేయవలయును.



పిదప కేసరిగారి నభినందించుచు శ్రీ జి. వి. యస్. శాస్త్రిగారు వ్రాసిన ఈ క్రిందపద్యములు చదువబడెను.

శ్రీలన్ జెన్నలరారి పూజ్యతమ సుశ్శీలార్థ భాగ్యంపు శ్రీ
లాలిత్యుండవు "కేసరీ" నిజమనోల్లాసంబునన్ వాగ్వధూ
పాలుండిత్తరి యాయురర్థముల సంప్రాప్తింప భోగంబులన్
పాలించున్, నిరతంబు వెల్గుము, యశఃపారీణతన్ "కేసరీ!"

కుత్తుక లెత్తి కోయిలలు "కోహుకుహుక్క"ని మావిగున్నలం
దెత్తుగ లేజిగుళ్ళనదు మింపొలయంగ త్వదీయ కీర్తులన్
సత్తువదేల్ప నీప్రజల సంతతివైపు వసంతు కంతుల
న్నిత్తరి బిల్వనిల్చెడి నవే! కనుగొమ్ము రయమ్ము "కేసరీ!"

ఎవ్వాడు తెలుగులో నింపుసొంపుల దేలి భారతామ్నాయంబు పైకి దెచ్చె!
ఎవ్వాడు సేయూతనిచ్చుచు "తెలుగు సీమాంధ్ర భోజుండం"చు యశముగాంచె!
ఎవ్వాడు రాజ్యంబునేలి టంకాల దీర్ఘంబు లాడించి గౌరవము సేసె
ఎవ్వాడు సర్వమర్పించి "దేశోద్ధారకుండం"చు నాంధ్రిని గొల్చె భక్తి!

అట్టి కీర్తి నలరారు శుద్ధాంధ్రవీర జ్యోత్స్నలవెలుగు కేసరి, యోగ్యమూర్తి,
యాంధ్రచరితలో నిలచి వెల్గారు నిత్యనూత్నకళల ప్రజ్వరిలి వినోదముగను.

లలితకళా మహాత్త్వము విలక్షణమై విలసిల్లె నీయెడన్
వెలిగెడు నీవి కన్నియ వివేకముతో జరియించి కీర్తి వె
న్నెల దనిపింప జేసెను వినిర్మల మయ్యెడు నీయనుంగు నె
చ్చెలి "గృహలక్ష్మి" తాండవము సేసె తెలుంగు విశాలసీమలన్.

వృత్తివిద్యల ప్రాధాన్య మెత్తిజూపి ప్రజల విజ్ఞాన విభవ సంపదల పెంచు
భరత ప్రాచీనగృహిణుల పథము జూపఁ నోరలు "గృహలక్ష్మి" మాపాలి యోగ్యలక్ష్మి.

పండితకల్పకంబవు! ప్రభన్ దనరారు మరాళ చందమున్
నిండుపయోధి నిన్ దనరు నీరము వేరొనరించి క్షీరముక్
దండి గ్రహించులాగున సుదాత్తత నీవుమదిందలంచి యు
ద్దండత వానిగాచెడు సుదారుడ! నిన్ను మహేశు డోముతన్!

అమల మణిమయ దర్పణంబైన నీహృదంతరంబున ప్రతిబింబ దర్శనంబౌ
యనగ "కేసరీత్రయము" నీ యశము నిల్పె, పూజ్యభావంబు గౌరవమూర్తిగనదె?

క్రమము భవిష్యము నీవనవరతము నీహృదయమునను వాంఛింపంగన్
వరలదె భారతదేశము నిరతము సౌఖ్యములబొంది నిర్మల మవుచున్.

జ్ఞనసౌభాగ్యము నీమదిం దలపగా జన్మించె హైస్కూలు మూ
తను సన్మాన మొనర్చి నట్టివియె "లోధ్రా" "గేహలక్ష్మి" సతుల్
తనివిం జెందక స్వర్ణకంకణము లౌదార్యంబుగా నీయ నిన్
గని శ్రీలక్ష్మియు బట్టె హారతులు సింగారించె గైకొమ్మివే!

## గౌ. జస్టిస్ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

పరిపాలవర్గముతరఫున చిత్రపటమును స్వీకరించుచు శ్రీ సత్యనారాయణరావుగారు ప్రప్రథమమున— శ్రీ సాంబమూర్తిగారంతకుముందు ప్రస్తావించిన రాష్ట్రరాజకీయముల నించుకసవిమర్శకముగతడవి— ఆ తగవులు, ఈర్ష్యలు మున్నగువానిజోలికిపోక— ఆంధ్రులు— నిర్మాణాత్మకమగు కార్యములందు కృషిచేయ వలయునని హెచ్చరించిరి. ఆ పిదప శ్రీ కేసరిగారు ఈ పాఠశాలల నేర్పరచిన చరిత్రనంతయు వివరముగా తెల్పి ఇట్లునుడివిరి:—

శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు మాపాలకసంఘమున కధ్యక్షులు. వారీచిత్రపటమునకు దాతలు. మేమిద్దానిని కృతజ్ఞతతో స్వీకరించుచున్నాము. ఈచిత్రము విద్యార్థులకు నిరంతరముత్సాహకారణమై యుండగలదు, వారు న్యాయశాస్త్ర విశారదులు అని వేరుగ చెప్పనక్కరలేదు. వీరు ఎందరు పేద విద్యార్థులకో అనేకవిధముల తోడ్పడిన దాతలని నేను స్వయముగా ఎరుగుదును. అంతేకాదు; వీరు ఆడంబరములేని దేశభక్తులు. వారు రాజకీయసంస్థలకును ఎన్నో విరాళములిచ్చిరి. నేడువారు కాన్‌స్టిట్యూయంట్ అస్సెంబ్లీలో గావించుచున్న సేవ అమూల్యము. ఆచిత్తుచట్టమును తయారుచేయుటలో వారిపాలు చాలభాగము. శ్రీ నెహ్రూ, పటేలుగార్లు చట్టసంబంధమగు నేచిక్కుకలిగినను వారి సలహాపొందుదురు. వారిపలుకీవిషయమున నెహ్రూ పటేళ్లకు వేదాక్షరము. వీరశక్తులయ్యు అంతదూరాభారమునకేగి ఈకృషి యంతయుచేయుట దేశభక్తి విశేషముననే. ఇక నీస్కూలువిషయము చెప్పవలెనంటె-చెన్నపట్నమున చిరకాలముగానున్న నీతెలుగుపాఠశాల కొరతతీర్చుటకు. పెద్దపెద్దలగు ఆంధ్రనాయకులెవ్వరును తలపెట్టకున్నను శ్రీ కేసరిగారుచేబూని నడిపించుచున్నందులకు నాధన్యవాదములు.

## శ్రీ కేసరిగారు

ఎల్లరికి కృతజ్ఞతతెల్పి "ఈ విద్యాలయములను తెలుగువారికొర కేర్పరచితిని. తెలుగువారు వీనిని చక్కగా వినియోగపరచుకోవలెను. కన్యావిద్యాలయమునకు తగినంత ప్రోత్సాహమురాలేదు. అందుచే తిరిగీ దాని నీసమీపమునకే మార్చితిమి. ఈనగరమునగల ఆంధ్రులందరు తమబిడ్డల నీవిద్యాలయములకంపి వీనినాదరించి లాభముపొందవలయునని కోరుచున్నాను. నన్నుగూర్చి ఉపన్యాసకులందరు పల్కినహితవాక్యములకు కృతజ్ఞుడను" అన్నారు.

ఆపిదప ఈ సంవత్సరమున క్రొత్తగా నీపాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగ విచ్చేసిన శ్రీ కనుపర్తి

# బ్రిటిష్ పరిశ్రమల ప్రదర్శనము

బ్రిటిష్‌దీవులలో ఈ మే 2-వ తేది మొదలు, 13-వ తేదివరకు-"బ్రిటిష్ ఇండస్ట్రియల్ ఫేర్"- అని బ్రిటిష్ దీవులలోను బ్రిటిష్‌కామన్‌వెల్తు దేశాలలోను-తయారైన వస్తువుల ప్రదర్శనము జరిగినది. ఈవస్తుప్రదర్శనము లండన్ నగరంలోను బర్మింగ్‌హామ్‌లోను అమర్చబడినది. లండన్‌లో వివిధవస్తుసామగ్రిన్నీ బర్మింగ్‌హామ్‌లో ఇంజనీయరింగ్ యంత్రసామగ్రిన్నీ ప్రదర్శించబడినది. వస్తువులన్నీ స్టాండులపైన అమర్చబడినవి. ఈస్టాండులాక్రమించిన నిడివి 26 మైళ్లట. ఈ 11 రోజులలో ప్రపంచమంతటినుంచీ 5 లక్షల జనమువచ్చి చూచారు. ఈ జనంలో విదేశాలనుంచి వచ్చినవారు పలువురు; ఇదివరకెన్నడు ఇంతమంది రాలేదట. అమెరికానుండి యుద్ధానికిముందుకన్నా 3 రెట్లు వచ్చారు. ఇండియానుండి అధికంగా వెళ్లినారు. ఆస్ట్రేలియానుండిన్నీ విశేషంగా వచ్చారు. స్వీడన్, హాలండ్, ఫ్రాన్సు, బెల్జియం, స్విట్జర్లంటు దేశాలనుండి తలావేయిమందివచ్చారు. వీరంతా తమాషాగా చూడవచ్చినవారుకారు. లక్షలాది విలువగల సరుకు కొనుగోలు చేయనువచ్చినవారు. గత రెండుసంవత్సరాలు ఇట్లావచ్చినవారు 32,000 అట!

లండన్‌లో బ్రిటిష్ సరుకులుగాక కామన్‌వెల్తు దేశాలనుంచీవచ్చిన సరుకులున్నూ ప్రదర్శించబడ్డాయి. వీనిలో ముఖ్యంగా ఇండియా, పాకీస్థాన్, కెనడా, సింహళం, సిప్రస్, హాంకాంగ్, జమైకా, మలయా,, మాల్టా, మారిషస్, మైసూరు, ట్రినిడాడ్, విండ్వార్డ్ దీవులనుండివచ్చిన వస్తువులు ప్రదర్శించడానికి 10,000 చ॥ అడుగులస్థళం ప్రత్యేకంగా ఏర్పాటైనది.

ఇండియానుంచి, పాకీస్థానమునుండి పలుసరుకులు పంపబడినవి. ప్రదర్శనంతెరిచిన మర్నాడు రాజు, రాణి, రాజమాత, రాచకూతురు (ఎలిజబెత్ రాకుమారి) అల్లుడు ముఖ్యంగా ఇండియా మొదలైన ప్రాచ్యఖండపుసరులకునుచూడవచ్చారు. రాచకూతురు దంతపుపనులను శ్రద్ధగాచూచినది. రాజమాత మేరీరాణి, వెండిబంగారపు నగలు తిలకించింది. రాజుఅల్లుడు ఎడింబరో ప్రభువు-ఇండియానుంచివచ్చిన ఖనిజాలు పరికించాడు; ముఖ్యంగా మైసూరునుంచివెళ్లిన బంగారంమీద ఆయనకళ్లువాలినవి. మైసూరునుంచి వెళ్లిన మంచి గంధపుచెక్కపనితనం రాచకుటుంబాన్నంతా ఆకర్షించినది. వారురంగురంగుల భారతీయవస్త్రసంపదను నిదానించిచూచారు. ఇండియాలో బ్రిటిష్‌రాజ్యం ఏర్పడకముందు-కులస్త్రీలు ఉత్సవసమయాల్లో ధరించే వస్త్రాలంకారములనుచూచి రాణులిద్దరు మురిసిపోయినారు. రాచకూతురు రాజుఅల్లుడు అనేకప్రశ్నలు వేసి. ప్రదర్శింపబడిన ఆయావస్తు సామగ్రినిగూర్చి అనేక సంగతులు తెలుసుకున్నారు.

ఇండియా తరపున ఇండియా హైకమిషనర్ కృష్ణమీనన్, పాకీస్థానము తరపున వారి హైకమిషనర్ రహింతుల్లా, ఆయన బేగంగార్లున్ను రాచకుటుంబాన్ని ఆహ్వానించారు. రాజుఅల్లుడు మీనన్‌తో మాటల్లో

(తరువాయి 315 వ పుట చూడు)

---

వేంకటసుబ్రహ్మణ్యంగారు ప్రేక్షకులకు అధ్యక్షులగు రాజుగారికి, చిత్రపటావిష్కరణమొనర్చిన శ్రీ సాంబమూర్తిగారికి ఎల్లరకు కృతజ్ఞతాభివందనము లొనర్చిరి.

సభాంతమున పాఠశాలవిద్యార్థులు కొన్నినాటక ప్రదర్శనములు గావించిరి. అందు ముఖ్యముగా ప్రతాపరుద్రీయమునందు కొన్నిసీనులు ప్రదర్శింపబడినవి. ఇందలి విశేషమేమనగా-వీరిని తయారొనర్చిన శ్రీ కనుపర్తి సుబ్రహ్మణ్యముగారు నాటకకర్తలగు శ్రీ వేంకట్రాయశాస్త్రిగారి చేతక్రింద తర్ఫీదై- ఇందలి పాత్రలనేకములు- యుగంధరుడు సహా-నటించినవారు. అధ్యక్షులగు శ్రీ రాజుగారునూ ఈ నాటకమున రాజుగా, మంత్రిగానటించినవారే. అందుచేవారు కడపటివరకు అత్యుత్సాహమున బాలురనాటకమును తిలకించి సంతసించిరి.

# గృహలక్ష్మి పద్యరత్నములు



(గత సంచిక తరువాయి)

సంతాననిధివి ; భూతలసంతతయభివృద్ధి కీవె సహచారిణి ; వీ
వెంతో సంతోషంబున సంతానము గనగవలయు ; జయగృహలక్ష్మీ !

సంతానము మనకేలాకా ; కాంతునితో సంతతంబు గల్గు సుఖంబే
సంతసమని కాంతామణి ! చింతింపకు నీదుమదిని ; శ్రీ గృహలక్ష్మీ !

సంతానవతివి యైనన్ సంతసమున నుభయపార్శ్వ జాత పితరులిం
తింతనరాని ముదంబుల గంతుల వేసెదరు; నిజముగా గృహలక్ష్మీ !

బిడ్డలఁ గన కుండిన చో గొడ్డు వనుచు నిన్ను తోడి కోమలు లెల్లన్
నొడ్డారంబుగఁ గాంతురు ; బిడ్డా ! ఈయర్థ మెఱుగవే! గృహలక్ష్మీ !

కుల ముద్ధరించు పుత్రుల వెలదులు ప్రసవింప వలయుఁ బ్రీతిని; లేకన్
కులకాంత కీర్తి దక్కదు ; తలపోయుము తత్త్వ మిట్టి దగు ; గృహలక్ష్మీ !

గర్భము గల్గిన భరమని దుర్భర వేదనలఁ జెంద దోషం బనుచున్
నిర్భాగ్య మతినిఁ దలఁకకు మర్భకుఁ డు దయింప హాయియగా ; గృహలక్ష్మీ !

సంతానము గాకుండగ కాంతలు మందులను మ్రింగగా నెంతురు ; తా
మెంతో ధీమంతుల మని; ఇంతీ ! రోగములఁ దెచ్చు నిది గృహలక్ష్మీ !

తమ రూప కళలు, సుందరతమమైన శరీర కాంతి, తగ్గు ననుచు, ను
త్తమ మాతృ పదవి నొల్లక కుమతిని వర్తింప మేలాకో ? గృహలక్ష్మీ !

పసిపాపలు గృహ మందునఁ బస గలుగఁగఁ దిరుగుచుంట భాగ్యము గాదే!
ముసి ముసి నవ్వుల బుడుతల దెసఁ గని యలరుట ముదము గదే ! గృహలక్ష్మీ!

తొమ్మిది మాసమ్ములు, గర్భమ్మును సంతోష మమర రక్షింప వలెన్
నెమ్మది శాంతము గనవలె, కొమ్మా ! కోపమ్ము వదలుకో ! గృహలక్ష్మీ !

కాంతునితో భోగంబులఁ జింతింపకు నాల్గు నెలలు జేరిన వెనుకన్
ఇంతీ ! ఈసూత్రము, సీమంతనమునఁ దెలియవమ్మ ; మాగృహలక్ష్మీ !

తల్లికిఁ దండ్రికి నత్తకు వల్లభునకు, మామ బంధువర్గమునకు నీ
సల్లలిత గర్భధారణ యుల్లమునకుఁ బ్రీతి నొసఁగు నో గృహలక్ష్మీ!

పుట్టింటి వారు వత్తురు పట్టీ! నినుఁ దోడి తెచ్చి ప్రాభవ మెసఁగన్
పుట్టెడు ప్రేమతో గాంతురు; దిట్టతనము జూపనమ్మ ధీగృహలక్ష్మీ!

కడుపున నుండెడు బిడ్డను కడు మెలకువ రక్షణంబు గావించుటకే
పడతీ! నీతలిదండ్రుల కడ కిపు డరుదెంచి నావు; ఘన గృహలక్ష్మీ!

మగని వియోగము నీకిపు డగపడు; నద్దాన శుభము లబ్బును; కాంతా!
వగవఁగ వలవదు దానికి మగడు నినున్ జూడ వచ్చు మాగృహలక్ష్మీ!

కె. అహోబలరావు.

---

# స్త్రీలు - వోటుహక్కు



శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు, బి. ఏ., బి. యిడి.

వోటుసంగతి ప్రతివాళ్లకు తెలియనివిషయం కాదు. కాంగ్రెసువిజయము వచ్చినప్పటినుంచి ప్రతి వాళ్లకు ఓటు అంటే ఏమిటో పూర్తిగా బోధపడింది. దీనికంతకు కాంగ్రెసుచేసిన మహత్తరసేవయే కారణం. ఈవోటుకు మూలాధారుడు ఫ్రెంచి మహావిప్లవకారుడైన రూసో.

మానవుడు జీవించుటకు, పెండ్లిచేసుకొనుటకు, ఆస్తి సంపాదించుకొనుటకు, యితరులతో కంట్రాక్టు కుదుర్చుకోవటమునకు ఏవిధమైన హక్కులుగలవో - అలాగే వోటుహక్కుకూడా సహజముగా మానవ జీవనంలో వున్నదని కొందరుప్రముఖులు వాదించారు. దీనినే 'నేచురల్ రైట్ తీరీ' అని ఆంగ్లంలో అంటారు. కానీ కొంతమంది యీతీరీని ఎదుర్కొన్నారు. వోటుహక్కులేకపోయినా ప్రజలు బ్రతుకగలరనినీ, కొన్నిదేశాల్లో వోటుహక్కులేదనినీ, వోటుహక్కు న్యాయమైనట్టియు, ధర్మమైనట్టియు పరిపాలనకోసం యివ్వబడినదనినీ వాదించారు. కనుక ప్రభుత్వం ప్రజలకు వోటుహక్కు యిచ్చింది.

ఇలాగయివ్వబడిన వోటుహక్కును ప్రతివ్యక్తి న్యాయంగా నిర్వర్తించడం తనవిధి. కొంతమంది వోటువున్నప్పటికీ దాన్ని వినియోగించకుండా, ఎన్నికలప్పుడు ఎవ్వరికీ వేయకుండా వూరుకుంటారు. ప్రభుత్వం ప్రజలకుయిచ్చిన హక్కును ప్రజలు సరిగ్గా వినియోగించుకోనప్పుడు ప్రజలు శిక్షాపాత్రులని కొన్నికొన్ని దేశాల్లో వోటువెయ్యనందుకు శిక్షిస్తారు. కనుక, బెల్జియం, రొమేనియా, జకోస్లోవేకియా, నెదర్లాండ్సు, అర్జంటైనా, రిపబ్లిక్‌లోను, స్విట్జరులాండులోని కొన్ని భాగాలలోను, నిర్బంధవోటు విధానం అమల్లోవుంది. వోటరు తనవిధిని నిర్వర్తించకపోతే బెల్జియందేశంలో జుల్మానావిధిస్తారు. రుమేనియా, నెదర్లెండ్సుదేశాల్లో యింకా కొంచం ఎక్కువగా శిక్షిస్తారు.

కాని, ఈ నిర్బంధ వోటువిధానాన్ని (Compulsory Voting) అన్నిదేశాలు ఖండించాయి. వోటును వినియోగించుకోవడమనేది మానవుడి యిష్టాయిష్టములతో కూడుకొనివున్నది. బలవంతాన్ని ప్రజలచేత వోట్లువెయ్యిస్తే, ప్రజలు అనామకుడైనవాడికి, ప్రభుత్వ శిక్షాబాధ తప్పించుకోటానికి ఎవ్వరికో ఒక్కరికి వివక్షతలేకుండా వోటుచేస్తారు. యిలాంటిసందర్భాలలో చేతకానివాడు ఎన్నుకోబడినట్లైతే - దేశానికి చాలా నష్టం! అందుచేత నిర్బంధ వోటువిధానాన్ని అన్నిదేశాలు ఖండించాయి. మానవుడు తన విధిని తెలుసుకుని, తనతరఫున యేవ్యక్తి పనిచేయగలడో గుర్తెరిగి వోటువేస్తే, దానివిలువ అతనికే కాకుండా, దేశానికికూడా కనబడుతుంది. మానవుడికి ఒక్కటే నిశ్చితాభిప్రాయము వుంటుంది గనుక ఒక్కటేవోటు యిచ్చారు. ఈవోటు మైనారిటీదాటిన ప్రతిస్త్రీకి, పురుషుడికి అన్నిదేశపు ప్రభుత్వములు యివ్వాలి. దీనినే 'యూనివర్సల్ సఫ్‌రేజ్' (Universal suffraze) అని అంటారు. కానీ, ఈ యూనివర్సల్ సఫరేజ్ అన్నిదేశాల్లోనులేదు. ఇలాగ అందరికి వోటుహక్కు యివ్వడంలో, మైనర్లకు, జబ్బుగావున్న వాళ్లకు, వోటుహక్కును చలాయించే అధికారములేదు. అందుచేత ప్రజల్లో కొంతమందికి వోటుహక్కు లేదన్నమాట! ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలో కొన్నిభాగాల్లో ప్రజలకందరకు వోటుహక్కులేదు. పూర్వం పన్నుచెల్లించేవాడే వోటుహక్కు పొందేవాడు. కాని మానవజీవితంలో విజ్ఞానాభివృద్ధి అయినాక పన్నుచెల్లించనివాడుకూడా మానవుడే అనినీ, పన్నుచెల్లించనంతమాత్రాన్ని, ఎన్నికల్లో వోటుహక్కు లేకుండా చెయ్యటం చాలాఅన్యాయమని గుర్తెరిగి చదువుకున్నవాళ్లకు 'లిటరెసీ' వోటు ఏర్పరిచారు. ఇవి చాలాముఖ్యము; విశాలమైన భావములో యిమిడివుంది.

ఇక ఆడవాళ్లకు వోటుహక్కు యివ్వవచ్చునా? కూడదా? అనేవిచిత్రవిషయం వివిధదేశాల్లో ఎట్లునిర్ణయించారో చూతాము. ఒక్క హిందూదేశంలోతప్ప మొన్న మొన్నటివరకు ఐరోపాఖండమందు

గల, నెదర్లేండ్సు, బల్గేరియా, జెకోస్లేవేకియా, పోర్చుగల్, యిటలీ, ఫ్రాన్సుదేశాల్లో ఆడవాళ్లకు వోటు హక్కులేదు. దానికి కారణాలు యేమిటంటే:—

1. స్త్రీకి వోటుహక్కు యిచ్చినట్లైతే, రాజ్యాంగవిషయాల్లో ఎక్కువ జోక్యంకలుగజేసుకుంటుంది గనుక సంసారమును పొందికగా నడిపేశక్తి ఆమెలో తగ్గిపోతుంది.
2. ఒకవ్యక్తి భార్యా వోటువేస్తే; భర్తవేసినవాడికే సాధారణంగా వోటువేస్తుంది గనుక, ఆమెవోటు, అతడివోటుకి 'డూప్లికేటు' లేక నకలు అవుతుంది.
3. ఆడవాళ్లు సహజంగా దేహదౌర్బల్యంకలవాళ్లు కనుక మనోదౌర్బల్యాన్నికూడా కలిగివుంటారు.

కానీ యిట్టి అసంధర్భమైన వాదనలను విజ్ఞానులు ఖండించారు.

1. ఆడవాళ్లకు వోటుహక్కు యిచ్చినంతమాత్రాన్ని ఆమెసంసారబాధ్యతయేమీ వడ్లగింజ ఎత్తంతైనా చెడదనిన్నీ, ఎందుకంటే-మూడేసిసంవత్సరాల కొకమాటు పదినిముషాలు ఆమెకాలం వోటుకోసం వినియోగపరుస్తుంది. కనుక మొదటివాదన తప్పువాదన.
2. భార్యావోటు, భర్తవోటుకి డూప్లికేటు కాదు. స్త్రీలకుకూడా, స్వతంత్రమైన వుద్దేశ్యాలుకలవు. తన దేశానికొరకు వుపయోగించే మనిషిని ఎన్నుకొనే సమయమందు భర్తచెప్పినమాట, భార్యావిననవుసరము లేక తనయిష్టానుసారం చేస్తుంది. అలాగ యిష్టానుసారం వోటువేసే వాళ్లలో ముఖ్యులు; పెండ్లికాని వారు; విధవలు.
3. స్త్రీలకు దేహదౌర్బల్యము కనుక మనోదౌర్బల్యము అనటానికి వీలులేదు. దేహదౌర్బల్యముకలవాళ్లకు మనస్సుబాగాపనిచేస్తుంది కనుక యీఅర్థంలేని మూడవవాదననుకూడా కొంతమంది ప్రముఖులు ఖండించారు.

ఐరోపా మహాసంగ్రామాల్లో పురుషులు యుద్ధాలకు వెళ్లినప్పుడు ఆఫీసుల్లో గుమాస్తాలుగా స్త్రీలే పనిచేశారు. స్త్రీహృదయం నవనీతంవంటిది. కర్మాగారాల్లో పనిచేసే స్త్రీలయొక్క, బాలురయొక్క కష్టాలను తొలిగించే చట్టాలనుతయారుచేయాలంటే, స్త్రీలే అందుకుతగ్గవారని జాన్ స్టూఆర్ట్ మిల్ వాదించేడు. అందుచేత యీ అడ్డంకులు తొలగింపబడి స్త్రీలకు వోటుహక్కు యివ్వబడింది.

కాబట్టి ఓటుయొక్క మహాత్మ్యం చాలాగొప్పది. వోటులో ఎంతేనా విలవవుంది. ప్రజలందరు ఏకమై మాకుఫలానాఅధికారి అక్కరలేదంటే ఆ అధికారి వుద్యోగాన్ని వెంటనే విరమించుకోవలసిందే. అమెరికా దేశంలో అక్కడ హైకోర్టు జడ్జీలను (అనగా అక్కడ సుప్రీమ్ ఫెడరల్ కోర్టు) ప్రజలు ఎన్నుకుంటారు. ఇంగ్లాండు, ఫ్రాంసుదేశాలమల్లే నియమించటంలేదు. 'మాకు ఫలానాఅధికారి న్యాయంగా సంచరించుటలేదని తోస్తుంది గనుక అక్కరలేదు' అని కొంతమంది ప్రజలు (అనగా ప్రభుత్వంనియమించిన మెజారిటీ వోటర్లు,) ఆ అధికారికి వ్యతిరేకంగా వోటువేస్తే, ఆ అధికారి వెంటనే తనపదవినుండి తొలగి పోవాలి. ఇలాగ అమెరికా ప్రెసిడెంటునుకూడా అక్కడప్రజలు తొలగించవచ్చు. దీనినివార్లు 'రీకాల్' (Recall) అంటారు. ఫ్రాన్సులో ఫ్రెంచి ప్రెసిడెంటును పైవిధానాన్నే తొలగించవచ్చును. దీనిని ఆదేశంలో 'ప్లెబిసైట్' (Plebicite) అంటారు. అందాకా పోనక్కరలేదు. ఒక చిన్నఉపమానంచెప్తాను. ఇంగ్లాండుకు రాజుగా వుండిన ఎనిమిదవ యడ్వర్డు సింప్సన్ సతిని (Mrs. Simpson) పరిణయమాడుతానంటే, ప్రజలకు యిష్టంలేదనీ, ప్రజలతరపున మంత్రిత్వమును స్వీకరించిన తాను ప్రజల భావాలను వెల్లడిస్తున్నానని అప్పటి ప్రధానమంత్రి బాల్డ్విన్ (Baldwin) చెప్పగా రాజుగారు రాజ్యం అక్కరలేదని వదలివేశారు.

కనుక వోటులో ఎంతవిలువవుందో, వోటర్లకు ఎంత శక్తిగలదో పైసంగతులువల్ల వ్యక్తమౌతోంది. కనుక ఇటువంటిమహత్తరమైన వోటును ప్రజలు, అందులో ముఖ్యంగా స్త్రీలు, ధనము కోసముగాని, బంధువులకోసంగాని, మోహమాటంకోసంగాని దుర్వినియోగపర్చక, భగవంతుడు తమకు ప్రసాదించిన విజ్ఞానాన్ని వుపయోగించుకుని వోటువిలువను జాగ్రత్తగా కాపాడుకోవటం ప్రజలకర్తవ్యం.

# మీ ముఖవర్చస్సును

# అందముగా, మనోహరముగా

## నుంచుడు...

## పాండ్స్ రెండు క్రీములతో



మీ ముఖ కాంతి అందముగా మరియు మృదువుగా నుండుటకు రెండు విధములైన జాగ్రత్త తీసుకొన వలెను, రాత్రి మరియు ఉదయము. రాత్రికి, చర్మ రంధ్రములలో లోతుగా జొచ్చి, శుభ్రపరచుటకు కొన్ని నూనెలతో తయారైన క్రీము అవసరము — పాండ్స్ కోల్డ్ క్రీము. పగలు, సూర్య రశ్మినుండి మీ ముఖము నల్లబడకుండ కాపాడుటకు తేలికయైన క్రీము అవసరము — పాండ్స్ వ్యానిషింగ్ క్రీము.




### ముఖ సౌందర్యపు రెండు విధానములు :—



ప్రతి రాత్రి, పాండ్స్ కోల్డ్ క్రీమును ముఖమునకు అంటించి మెల్లగా రుద్దుడు. దీనిలో మిశ్రితమైన నూనెలు చర్మరంధ్రములలో జొచ్చి, అచ్చటనుండే మురికి నంతటిని బయటికి త్రోయును. తరువాత తుడిచి వేయుడు. తళతళ మెరసే మీ ముఖమును చూడుడు!

ప్రతి ఉదయము, సూర్య రశ్మినుండి మీ ముఖమును కాపాడుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పలుచని పొరగా అంటించుడు. చర్మరంధ్రములలో సులభముగా జొచ్చి, అదృశ్యమై, కంటికగపడని పొర యొకటి ఏర్పడి దినమంతయు మీ ముఖమును కాపాడును.

# పాండ్స్

వ్యాపార విచారములకు : యల్. డి. సేమూర్ అండ్ కం. (ఇండియా) లి.

బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, నవ గోవ, కరాచి, కొలంబో, రంగూన్

# గృహలక్ష్మి

శ్రీమతి భోగరాజు చిట్టెమ్మగారు

(స్థానం సభాభవనం)

"లెక్చరెంతో బాగుంది రా కృష్ణా."

"ఇవ్వాళ వుపన్యాసం చెప్పిందెవరో నీకు తెలుసా? ఆయన పేరు, రావుసాహెబు రామారావుగారు. రైతులోకానికి చాలా సేవచేశాడులే. ఆయన పేదలపాలిటి పెన్నిధి. దీనులపాలిటి కల్పతరువు. ఆయనసేవ వర్ణించి చెప్పాలంటే ఒకపెద్ద పుస్తకమవుతుంది."

"అంత గొప్పవాడుట్రా ఆయన?"

"నీ మొహంలాగేనే వుందిలే, రామాయణంఅంతా విని, రాముడికి సీత యేమవుతుందని అడిగాడట వెనక నీలాటి మహానుభావుడే ఒకడు. సూర్యుణ్ణి దివిటీతో చూపించినట్లుంటుంది ఆయన మహిమ వర్ణించిచెప్పటం. రైతులోకానికి సేవచేయటంలో ఆయన యెంత కష్టపడ్డాడనుకున్నావు? ఎంత త్యాగం చేశాడనుకున్నావు?"

"చాల్లే, నీమాటలు నువ్వూను ఇల్లాంటివాళ్లని చాలామందిని చూశాను. చెప్పటానికేమో పెద్ద పెద్ద మాటలు చెప్తూతారు. కాని మళ్లీ వీళ్లే రైతులరక్తాన్ని జలగల్లాగా పీల్చి త్రాగేస్తారు."

"ఈయన అల్లాటి వాడుకాదురా. చాలాదయగల మనిషి."

* * *

(స్థానం రామారావుగారి యిల్లు)

"బాబూ, ఈయేడు పంటయేమీ పండలేదు. కట్టుబడి యిచ్చుకోలేము. కొంచెం కనికరం చూపించండి."

"ఏమిట్రా మీమాటలు, మీరూనూ. అట్లాఏమీ వీలులేదు."

"బాబయ్యా, మీరే యీవిధంగా మాట్లాడుతే మేమేమి చెయ్యగలం. మహాప్రభువులు. కనికారం చూపించండి. మీరేగదా మళ్లీ మమ్మల్ని గురించి వుపన్యాసాలిస్తారు."

"అందుకనే మీకింత అలుసుగావుంది. అట్లా ఏమీ వీలులేదు. ఒక్క బస్తాకూడా తగ్గించేందుకు వీలులేదు. మీకేం, మీరు అడుగుతారు. మీరు చెప్పినట్లల్లాచేస్తే నేను కూడా ముష్టివాణ్ణయిపోయి వీధులవెంట అడుక్కుతినవలసిందే."

"ఎక్కడనుంచి తెచ్చియ్యగలం బాబయ్యా"

"తలైనాతాకట్టుపెట్టి తెచ్చియియ్యండి; లేకపోతేమిమ్మల్ని నానాతిప్పలుపెడతాను."

(ప్రవేశం సుశీల)

"నేనొక్కమాట చెబుతాను. కోపగించుకోకుండా వినండి. ఈవిధంగా చెయ్యటం మీకు ధర్మంకాదు. పాపం, వాళ్లనిచూడండి; ఎంతదీనంగా వున్నారో. మీవంటివాళ్లే యీవిధంగా చేస్తూవుంటే పాపం వాళ్లగతి యేమిటో కొంచెం ఆలోచించండి. మీకు అన్నివిషయాలు తెలుసునుగదా? తెలియనివారైతే పోనీఅని అనుకోవచ్చును. రైతు జనోద్ధరణకు కంకణం కట్టుకొన్న మీరే యీవిధంగా చెయ్యటం ఏమీ బాగాలేదు. సభలలోకివెళ్లి రైతుల్నిగురించి పెద్ద పెద్ద వుపన్యాసము లివ్వటమూను, యింట్లోకివచ్చి యీవిధంగా చెయ్యటమూనా? మీమనస్సులో మీరే ఆలోచించుకోండి. పాపం యీసంవత్సరం యేమీ పండలేదు. వాళ్లకే తింటానికి కూడు లేకుండాపోయింది. ఇంకా కట్టుబడి ఎల్లాయిస్తారు?"

"వాళ్లెట్లా బ్రతుకుతారని అడిగావు. సరే, మనసంగతి యేమిటి? ఇంట్లో ఒక్కబస్తాధాన్యంకూడా లేదు."

"ధాన్యంలేకపోతేయేం. మనం, ధనవంతులం. డబ్బుపెట్టికొనుక్కొని తినగలం. మనకేమీ ఫరవాలేదు. వాళ్లకుకూడా తలోనాలుగు బస్తాలు కొనుక్కొనేందుకు డబ్బు యిచ్చిపంపండి; పాపం, పిల్లాజెల్లా కలవాళ్లు. సుఖపడుతారు."

"బాగానేవుందిలే నీసలహా; కొరవితో తలగోక్కున్నట్లున్నది. కట్టుబడి తగ్గించటమే కాకుండా యింకా డబ్బుకూడ యివ్వాలిగదూ?" 'మీరు రోజూ దేముడిపూజ చేస్తూవుంటారుగాదా. ఆయన ఎక్కడవుంటాడో మీకు తెలుసునా? దీనుల హృదయమే ఆయన నివాసస్థలం. వీళ్లని దయగాచూచి సహాయముచేయటమే ఆయనను పూజ చేయటం. మానవసేవయే మాధవసేవ అనేమాట మరచిపోయారా? సరే. ఆమాట ఆలావుంచండి. సభలలో పెద్ద పెద్ద లెక్చర్లు చెప్పతున్నారూ? యింటికివచ్చినతర్వాత యీవిధంగా రైతుల్ని బాధపెడుతున్నారూ? ఇల్లాంటి కపటమైన మనస్సుగలవాళ్లని భగవంతుడెప్పుడూ క్షమించడు."

"నిజమే, సుశీలా, ఇవ్వాళ నువ్వు, నాకు జ్ఞానోపదేశంచేశావు. స్త్రీకి 'గృహలక్ష్మి' అనే బిరుదు పెద్దలు వూరికే యిచ్చారా. నిజంగా నీకానామం సరిపోయింది. నాకు కర్తవ్య ముపదేశించావు. ఇకనుంచి నువ్వుచెప్పినట్లు చేస్తాను."

"నాజన్మం ధన్యమయింది, నాకంటె అదృష్టవంతురాలెవరు?"

"రా మరి, పాపం వాళ్లకి ఈ యేటికి సరిపడే డబ్బు యిచ్చిపంపిద్దాం."

---

త్యాగసేవాసక్త, విద్యాసుందరి, గానకళావిశారద
శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారికి



# పద్యకుసుమాంజలి

కవికుమార సోమయాజుల వెంకటశేషయ్యగారు



శ్రీమన్మాన్యుఁడు త్యాగయస్వామికిఁ బ్రియశిష్యమణివి, సంగీతమునఁ
ధీమతివి, నాగరత్నమ! నేమంబిడి నిన్నుఁ బ్రోవ శ్రీశుకాదలతుఁ.
జ్ఞానకేసరి సత్కారఘనత నీకు గానకేసరివగుటచేఁ గలిగెనమ్మ;
అతఁడుగృహలక్ష్మి దేవతకర్భకుండు; ఆంధ్రమాతకు సత్సుతవమ్మనీవు.

భక్తరత్నంబని భక్తులువినుతింప, త్యాగరత్నంబని త్యాగులనఁగ
గానరత్నంబని గాయకుల్ వచియింప, దానరత్నంబని దాతలనఁగ
జ్ఞానరత్నంబని జ్ఞానులువచియింప, భోగరత్నంబని భోగులనఁగ
స్త్రీరత్నమని పెక్కుస్త్రీలుప్రశంసించ, మాతృరత్నంబని బాలికలన

నాగరత్నంబుయను స్వల్పనామమునకు నేను యంగీకరింప గా కేరనంచు,
భారతీమాత నీప్రియమాత నేడు యఱిఁగె గావున దివ్యరత్నమ్మవీవు.

జ్ఞానమునందు, దివ్యమగు గానమునందును, దైవభక్తియం
దైనను, సత్కళాభిరుచి యందు, మనోహరసత్కవిత్వమం
దైనఁ, స్వదేశసేవయెడనైన, నినుఁ సాదూగు సోదరీ
గానము, స్వర్ణకంకణపు గౌరవమయ్యది నీకునల్పమా.

గానవిద్యాకళా కవితప్రపూజ్యనా భవదీయదివ్య ప్రాభవము గాంచి
కఠినపాషాణముల్ గఱగింపజాలు నీ కమనీయ సుకుమార గాన మరసి
త్యాగరాజస్వామి ధన్యుని శిష్యత్వ మందిన నీదివ్యమహిమ నెంచి
ఘనమైన నీదివ్య గానామృతము ద్రావి హర్షించు రాజుల నాలకించి

నాదు కవితాకుమారి యానందమంది పద్యకుసుమాంజలిని యర్పణ మొనర్చె,
గనుక గొనుమమ్మ నాచేయు గౌరవమ్ము నాగరత్నమ్మ గానరత్నమ్మ నేడు.

# శ్రీ రమణమహర్షి: రచన

శ్రీమతి ఓరుగంటి కామాక్షి
రామచంద్రయ్యగారు.



ఈ శీర్షికమూస్తే వారుస్వయముగా వ్రాసినవాటినిగూర్చి వ్రాస్తానని పొరపడవచ్చు. ఎందరెందరో శ్రీవారి చరిత్ర, వారిమహిమలు, వారిలీలలు, వారివేదాంతము మొదలగువాటిని సంక్షేపముగనో, విపులముగనో వ్రాసియున్నారు; వ్రాస్తున్నారు. చరిత్రసమగ్రముగా నచ్చులోబడింది కనుక, మహిమలు వారు వారు స్వయముగా తెలుసుకొనవలయునుకాని అపారమైనదానిని చెప్పి విశదమొనర్చుట కష్టము. వేదాంతము కేవలము గొప్పపండితులు చెప్పదగినదికనుక నేను దానిజోలికి పోక వారినిగూర్చి ఇతరులు వ్రాసేవి, వారినిగూర్చినవని ఇతరులు అనుకునేవి వాటినిమాత్రమే చెప్తాను.

వారిని లోకమునకు తెలుపుట యందు ఎందరెందరో మహాత్ములు కృషిచేశారు. ఆంగ్లము తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, గుజరాతి, మరాటి, హిందీ, ఉర్దు, బెంగాలి మొదలగు భాషలలో గద్య, పద్యరూపములలో పుస్తకాలను అచ్చువేస్తున్నారు. పాశ్చాత్యదేశములలో ఆ ఆభాషలలో పుస్తకాలువెలువడ్డాయి. పండితులు, పామరులు అందరు వ్రాస్తారేకాని, అరుగులమీదికెళ్ళి ఉపన్యాసాలిచ్చుట అంతగా కానరాదు. అంటే ఉపన్యసించాలంటే వాక్చాతుర్యము, అడ్డులేని వాగ్ధార, ధైర్యము కావలయును. సరేనని ఉపన్యసించినా ఎవడైన కొంటెప్రశ్నలు వేయొచ్చు. ప్రసంగవశమున తప్పు వెలువడితే జనసమూహములో నానాఅల్లరి బయలుతేరుతుంది.

మహానుభావుల్ల చరిత్రవ్రాయుట అత్యవసర మనకతప్పదు. శాశ్వతముగా ఎన్నితరాలవారో దాన్ని తెలుసుకొనుటకు మంచిసాధనము. అట్లాగే శ్రీరామకృష్ణపరమహంస, శ్రీరామతీర్థుల చరిత్రలనుచదివి ఇప్పటికి ఆనందిస్తున్నాము. కొన్నివేలఏండ్లక్రిందట అవతరించి ఖండఖండాంతరములవ్యాపించిన మతకర్తయని ఖ్యాతి చెందిన శ్రీ బుద్ధభగవానుల చరిత్రచదువుటకు కుతూహలపడని మనుజుడెవడు? కానీ వారి జీవితానంతరమున వ్రాసినవగుటచేతనో ఏమో వాట్లలో అతిశయోక్తులు లేకపోలేదు. సజీవులైన శ్రీవారిచరిత్రము అనేక భాషలలో వ్రాసి ముద్రించియుండుట ప్రశంసనీయము! మనసుకృతము!! అప్పుడప్పుడు శ్రీవారే చరిత్రాంశములను స్వయముగాచెప్పుదురు.

పెద్దలవి జీవవాక్కులుగదా! సర్వకాలసర్వావస్థలయందు సత్యములు. అట్టివి వినవలయును, తెలుసు కొనవలయుననియే మనఉత్సుకత. వారి వేదాంతమునుగూర్చి వారే అనేకగ్రంథములు రచించియున్నారు. తెలుగు, తమిళము, మలయాళము, సంస్కృతములయందు వారు స్వయముగా వ్రాసిరి. శ్రీ శంకరాచార్యులువ్రాసిన కొన్నిటిని అనువదించిఉన్నారు. శ్రీ శంకరాచార్యుల భాష్యము మొదలగు మన ప్రాచీనగ్రంథములను చదివినవారికి వీరి 'నేనెవడను' అనే విచారము కొంచము సులభముగా బోధపడును. పెద్దలమతమేకాని తనుక్రొత్తగాచెప్పేది ఏదిలేదని శ్రీవారే నుడివియున్నారు. కానీ, వారిమతము తత్త్వము ఇదియే నని ఎందరోవ్రాస్తారే అదియేమి? దేశ, కాల, వర్తమానములచేత అబాధితమైన తత్త్వము వ్యక్తిగత జన్మాంతర సుకృత పరిపక్వవ్యత్యాసమువలన మారును. వారివారి కర్మ, బుద్ధుల కనుగుణముగానే వారి మాటలు బోధపడును. సముద్రమెంత పెద్దదైనా, మనచేతనుండు పాత్రయంతే మనఉపయోగమునకువచ్చును. శ్రీవారి పుస్తకాలకు అనువాదములు అనేకభాషలలో అనేకభక్తులచేత రచింపబడినవిఉన్నాయి. అవి ఎంతమందికో ఉపయుక్తములే. పెద్దలమతాని కనుగుణముగా చెప్పువరకు సమ్మతమే, భేదమొచ్చిన సంశయాస్పదమవకతప్పదు.

వారిమీద స్తోత్రాలు ఎన్నోఉన్నాయి. వాటిని రచించినవారు, వాటిని చదివి అర్థజ్ఞానముచేతనో, భక్తిచేతనో పాడుకునేవారు కృతార్థులగుటకు అవి భక్తకోటికి చాలముఖ్యము.

నన్ను ఎందరో మహర్షినిగూర్చి చెప్పుమని అడుగుతారు. చిన్నప్పటినుండి వారిదగ్గిరికి వెళ్లుదాననైనా విషయగ్రహణమందు అసమర్థురాలను. 'ఏమిటిచెప్పనా' అని ఆలోచనవస్తుంది. వాళ్ళను ఒక్కసారివెళ్ళి శ్రీవారిని దర్శించమంటాను. అంతకంటే చేయతగిన మరోఉత్తమమైన పనిలేదనేదాన్ని. చెప్పేనుగా చరిత్ర విపులమైంది; వేదాంతము నాబుద్ధికతీతము; మహిమలా అపారము. వారిసన్నిధి అనుభవైకవేద్యము కనుక అనుభవించమంటాను.

అసలు చూడనివాడికిచెప్పితే నమ్ముతాడో, నమ్మడో. శ్రీ వాల్మీకిమహాముని శ్రీరామచంద్రుని వర్ణించుటలో 'సముద్ర మివగాంభీర్యే. ధైర్యేణ హిమవానివ' అన్నారు. చూడనివాడు అతిశయోక్తి అంటాడు. ఇక మామూలుప్రశ్నలు బయలుతేరుతాయి. ఏంతింటారంటాడు; కొంతభేదమున్నా 'మన వలెనే' అంటే అంతేనా అని జవాబు. మహర్షియంటే నియమాలుండాలని ఇతనియూహ. ఫోటోచూపితే సోఫామీదనున్న పరుపుమీద కూర్చున్నారేమన్నట్లు సంశయంగాచూస్తాడు. అద్వైతముచెప్పే మహర్షి ఆశ్రమంలో వారితమ్ముడు సర్వాధికారికావచ్చునా? అని త్యాగశీలునిబాధ. వీటన్నిటికి సమాధానము? వీటన్నిటికి అతీతమైనఆ స్వామిని వీనితో సమన్వయపఱుప చూచుటకంటే, వారినిచూచి వారిశాంతిమయ సన్నిధి సుఖమును అనుభవించుట, వారి పూర్వచరిత్ర, ఇంకా వారి తత్త్వము మానవునికి పురోగామి యగుటకు తోడ్పడును.

'జరిగినవి జరిగినట్లే స్వంతసరుకు కలపకుండా ఎంతచెప్పకల్గితే అంతమంచి చరిత్రకారుణ్ణి అవుతానని' శ్రీ రమణచరిత్ర కర్త యన్నారు. జరిగిందిమాత్రము చెప్పుట కొంచము కష్టమైన పనియే.

వాచామగోచరమైన దానిని నిర్వచించే ఓ మూగజనమా!
అపారమైన ఒకటిని పారము కాననగునా?
అలలులేని నీటివలె చిత్తశుద్ధిగలవారికే
జటాధారి నిష్కళంకుడై యుండెను.

అని శివజ్ఞానస్వామియనే మహాజ్ఞానివ్రాసియున్నారు అరవమున పద్యరూపంలో.

శ్రీ రమణార్పణమస్తు.

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

## స్త్రీ ధనమే నా మూలధనము

ఈ నా జీవయాత్రకు స్త్రీ ధనమే మూలధనమని చెప్పుకొనుటకు చాల గర్వ పడుచున్నాను. సుమారు అర్థశతాబ్దమునకు మునుపు మనదేశములో అనుకూల దాంపత్య కుటుంబములు చాల తక్కువగనుండెను. భర్త భార్యను కొట్టుటయో, తిట్టుటయో, ఇంటినుండి తరిమివేయుటయో, సామాన్యముగ జరుగుచుండినవి. మగని బాధలను భార్య భరించజాలక నూతిలో పడుటయు, విషము త్రాగుటయు, కిరసన్ నూనెతో కాలిపోవుటయు మొదలగు అమానుష కృత్యములు పలుమారు జరుగు చుండుట వినుచుంటిని. ఈ కారణములవల్ల ఆకాలపు గృహలక్ష్మికి మనశ్శాంతిలేక కాలమును కడుకష్టముతో గడుపుచుండెను. ఈ సందర్భమును నేనప్పుడు అవకాశముగ తీసుకొని స్త్రీలను బాగుపరచి తద్వారా నేనును బాగుపడవలయుననే సదుద్దేశముతో ఒక చిన్న పన్నాగమును పన్నితిని.

అప్పుడు నేనొక అడ్వర్టైజుమెంటును (ప్రకటనను) తయారుచేసుకొని ఆ కాలమున సుప్రసిద్ధ తెలుగు పత్రికయగు ఆంధ్రప్రకాశిక కార్యాలయమునకు వెళ్లితిని. ఈ కార్యాలయము, అప్పుడు పూంటురోడ్డులో యొక మిద్దెమీద యుండెను. ఈ పత్రికాధిపతి యగు ఎ. సి. పార్థసారథినాయుడిగారిని చూచితిని. నేను వారిని దర్శించుటకు వెళ్లినప్పుడు వారు పాతవార్తాపత్రికలను చించి వాటి కాళీ స్థలమున పెన్సులుతో వ్యాసములు వ్రాయు చుండిరి. నేను వారిని చూచి నమస్కరించితిని. చిఱునవ్వుతో నన్ను చూచి కూర్చుండ మనిరి. వచ్చిన కారణమును విచారించిరి. నా జేబులోనున్న అడ్వర్టైజుమెంటును వారి చేతికిచ్చి పత్రికలో ప్రచురించుమని అడిగితిని. నేనిచ్చిన కాకితమును రెండుమూడు సార్లు ఇటూఅటూ పారచూచి నన్నుచూచి ఫక్కుననవ్వి ఇది వేయుటకు తడవకు రు 10 లు చార్జి అగునని చెప్పిరి. అంత యిప్పుడు యిచ్చుకోలేనని చెప్పి నావద్దయున్న అయిదు రూపాయీల నోటునుతీసి వారి చేతులో పెట్టితిని. అప్పుడు వారు నన్నుచూచి నీవు చాల గడుసువాడవుగ నున్నావని చెప్పి మరియొకసారి నవ్వి నన్ను పంపివేసిరి.

ఆ కాలమున మద్రాసులో నాయుడుగారు ఆంధ్రులలో ప్రముఖులుగనుండిరి. ఆంధ్రమున గంభీరమగు ఉపన్యాసముల నిచ్చుచుండిరి. చెన్నపురిలో ఆ కాలమున నాయుడుగారు మాట్లాడని సభయుండెడిదికాదు. వీరు మొదట ఆంధ్రమున ఉపన్యాసమును ప్రారంభించి అరవములో ముగింతురు. సభలో మహమ్మదీయులు మళయాళీ లుండిన వారి భాషలలో మాట్లాడి అందరిని నవ్వించుచుండిరి. వీరు బక్కపల్చగ నుందురు. అంటి అంటని తిరుమణి శ్రీ చూర్ణమును ముఖమున దిద్దువారు; నవ్వు ముఖము. తెల్లని తలపాగా, లాంకోటును ధరించువారు. సరసులు. తెలుగు పండితులు-చక్కని వాగ్ధోరణి గల వారు. ఆ రోజులలో వీరు గొప్ప కాంగ్రెసువాదులు. ఆ నాడు జరిగిన ఈ నన్ని వేశమంతయును ఈ నాడు నా కంటికి కనుపడుచున్నట్లే యున్నది.

నేను ఆ నాడు పత్రికలో ప్రచురించుటకు వారివద్ద యిచ్చిన అడ్వర్టైజిమెంటు యేమనగా:—

మందగమన - సుందరాంగి అను ఇరువురు చెలికత్తెల సంభాషణ.

(స్థళము - నీలాటి రేవుగట్టున బోర్లించిన బిందెలమీద ఇరువురు కూర్చుండి చేసిన సంభాషణ)

మందగమన:— ఏమే, సుందరీ! ఈ మధ్య నీవు నాకు అగుపడుటయే లేదేమే?

సుందరాంగి:— ఏమి చెప్పుదునే అక్కయ్యా నా అవస్త? నా మగడు నన్ను చూచినప్పుడెల్లను కారాలు మిరియాలు నూరుతుంటారు. చీటికి మాటికి వీపు బద్దలయ్యే టట్లుగా బాదుతారు. నాతో మాట్లాడరు. ఇంట వరుండరు. ఈ నా అవస్తలో నిన్ను నేను యెట్లు చూడగల్గుదును?

మందగమన:— ఓసీ పిచ్చిచెల్లీ! ఈ మాత్రమునకేనా నీవు వ్యసనపడడము? నీ కంటె పదిరెట్లు హెచ్చుగ కష్టముల ననుభవించిన దానను. ఇవిగో చూడు నాచేతి మీద వాతలు; వీపుమీాది కొరడాదెబ్బల మచ్చలు. అయితే ఇప్పుడు నేను, నా భర్త యొకరి నొకరు క్షణమాత్రమైనను విడువజాలనంత అనురాగమున సుఖముగ నున్నాము. ఇందుకు కారణము మా ప్రక్కయింటి సరస్వతియే. ఆమె యెప్పుడును ఆంధ్రప్రకాశిక పత్రికను చదువుచుండును. ఆమె నాకు చెప్పిన రహస్యము వల్లనే ఇప్పటి మా యిరువురి స్నేహము; దాని ఫలమే ఈ చిట్టి కూతురు వాసంతిక.

సుందరాంగి:— అక్కయ్యా! నీకు నమస్కరించెదను. ఆ రహస్యమును నాకును చెప్పి పుణ్యమును కట్టుకొనవే.

మందగమన:— చెప్పెదను వినుము సుందరీ, మద్రాసులో "కేసరికుటీర"మను యొక వైద్యశాలకలదు. ఆ వైద్యశాలలో తాంబూల రంజనీ అను వడకటించిన తాంబూలములో వేసుకొను పరిమళ మాత్రలను విక్రయించెదరు. ఆ మాత్రల వెల బుడ్డి 1కి నాలుగు అణాలు మాత్రమే. వాటిని నీవుకూడ తెప్పించుకొని నీ భర్తకిచ్చు తాంబూలమున నుంచి యిచ్చిన వారము దినములకే నీ భర్త నీ స్వాధీనమై నీకు దాసానుదాసుడగును. గనుక నీవు వెంటనే ఇంటికిపోయి కేసరికుటీరమునకు కార్డును పంపుము.

సుందరాంగి వెంటనే యింటికి వెళ్లి మద్రాసు కేసరి కుటీరమునకు తాంబూలరంజనీ మాత్రలను పంపమని ఆర్డరు పంపెను. మూడవదినమున మాత్రల పార్శిలు వచ్చెను. వచ్చిన ఆ రాత్రియే మాత్రలను భర్తకిచ్చెను. మరుసటిదినము మొదలు భర్తలో మార్పు గలిగి క్రమముగ అనుకూల దాంపత్య సుఖమనుభవించుచు త్వరలోనే సుందరాంగి సుముఖిని గనెను.

ఇదియే నా ప్రకటన.

ఆ కాలమున వార్తా పత్రికలలో ఔషధముల ప్రకటనలు చాల తక్కువగ నుండెను. ఈ ప్రకటనను చదివిన వారందరు మాత్రలకు ఆర్డర్లు పంపుచుండిరి. ఈ వడక టించిన మందును రుచి చూడవలయుననే కోరికతో పురుషులుకూడ తెప్పించుకొను చుండిరి. తమాషాకుకూడ కొందరు తెప్పించి వాడుకొనుచుండిరి. కొందరు పురుషులు తమ వెంకి భార్యలకుకూడ యిచ్చుచుండిరి. ఈ విధముగ ఈ మాత్రలకు గిరాకి యేర్పడి క్రమ ముగ సప్లైచేయుటకుకూడ సాధ్యముకాక యుండెను. దినమునకు సుమారు నూరురూపా యల మాత్రలను విక్రయించుచుంటిని. ఈ చిన్న సన్నివేశమే నా జీవయాత్రను దారిద్ర్యారణ్యమునుండి ధనార్జనా సమర్థునిచేయు రాజమార్గమునకు చేర్చినది. నాటి నుండియే నా జీవితమార్గము సుఖసౌకర్యములకు మలుపుతిరిగినది.

ఈ విధముగ నాకు ప్రోత్సాహము కలిగించిన ఈ స్త్రీ ధనముతో వైద్యశాలను వృద్ధిపరచి ఇతర మందులను తయారుచేయగలిగితిని. క్రమముగ కేసరికుటీరమును అనేక విధముల వృద్ధిపరచినందున అనేకులు ఈ సంస్థవలన జీవించుచున్నారు. నేనును సుఖముగ జీవించుచు తోచిన ధర్మకార్యములను చేయుచున్నాను. వీటి కన్నిటికిని నాకు మొదటినుండి సహాయపడి నన్ను యిప్పటి స్థితికి తీసుకొనివచ్చినవారు స్త్రీలు. అందు వలననే నేను ప్రతిసంవత్సరమును మాతృపూజనుసల్పి కృతార్థత చెందుచున్నాను. సాధారణముగ భిక్షాటనమునకు బైలుదేరు నప్పుడు ఇంట తల్లి పిడికెడు గింజలను

జోలెలో వేయు ఆచారముగలదు. మధూకరమునకు వెళ్లునప్పుడు జోలెలో తల్లి పిడికెడు అన్నమిడును. ఉపనయనమునాడు తల్లి మొదట భిక్షము పెట్టవలయును. గనుక మాతృభిక్ష అక్షయము-మాతృపూజ జన్మసాఫల్యము. జీవన్ముక్తులగు శ్రీ భగవాన్ రమణ మహర్షులవారును మాతృభూతేశ్వరుని వేయివిధముల ఆరాధించుచున్నారు. సృష్టిస్థితిలయకారకులైన త్రిమూర్తులను ఆదిశక్తి, జగద్ధాత్రియగు దేవినుపాసించిరి. క్రైస్తవ ప్రపంచమున—పవిత్ర మాతృశ్రీ మేరీయమ్మకు మొదట వినతు లొనర్తురు. కనుక నావంటి సామాన్యుడు కృతజ్ఞతాపూర్వముగ నా సర్వస్వమునకు మూలమైన స్త్రీలను, మాతృస్వరూపిణులనుగా పూజించుట సహజము. అట్టి మాతృపూజ ఇహపరసాధకమని నాగాఢ విశ్వాసము.



["ఆంధ్రప్రభ" వారు 21.4.49 నాటి సంచిక ప్రధానవ్యాసమున "నా చిన్ననాటిముచ్చట్లు" నిట్లని ప్రశంసించిరి. గృ॥సం]

ఆయన ఆత్మకథ "నా చిన్ననాటి ముచ్చట్లు"లోని కొన్ని కొన్ని ఘట్టాలు ముందు తరాలవారికి వెలుగు దారులను చూపించగలిగినట్టివి. ఇంతేకాదు.

భాష సొగసులను చూపడానికి ఎక్కడా ప్రయత్నం లేకపోయినా, గంభీర భావాల ప్రకటనకు ప్రయత్నం సయితం లేక పోయినా, ఆయన ఆత్మకథ ఆంధ్ర సరస్వతికి ఒక ఉత్తమ కానుక. బ్రతుకును చీల్చుకొని బయటికి వచ్చిన వైనందున దాని పుటలలో కొన్నింటికి ప్రకృతి సిద్ధంగా లభ్యమైన పదహారు వన్నెల పసిడి మిసిమి కలదు. ఇప్పటి నిడివికి సగానికి తగ్గించిన పక్షంలో అది మన భాషకేకాదు, ఏ భాషకైనా మన్నన తేగల గ్రంథం కాగలదు.

---



# రీటా తల వెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాను మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తల వెంట్రుకలను రాలకుండాచేసి, క్రొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించు శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజ రక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# అర్పణ

భక్తవత్సల ! నీప్రేమ భక్తి వితతి
అమల నవరత్న ఖచిత సింహాసనములు
నీకు అర్పించి స్వామి ! అనేక విధుల
పూజ చేతురు బంగారు పూల తోడ.

రత్న హారాలు వజ్రాలు రజిత పళ్లె
రములు రత్నకిరీట విభ్రాజితములు
మణులు ముకుపులు బహుమూల్య ధనము
లొసగి
నిన్ను పూజించు చున్నారు నీర జేశు.

నేను పేదరాలను స్వామి! నిన్ను నేడు
పూజ సేయుగ కోర్కెలు పుట్టె మదిని
ఆజ్ఞ ఇత్తువా ! లేదా ! దయాసముద్ర !
వట్టిచేతుల వచ్చిన బాల కిపుడు.

ధూపదీప నైవేద్యముల్ తొలుతె లేవు
దర్శనపు అలంకారమే తలచ వద్దు
ఇంక నాకడ నీకు నలంకరింప
పూలమాల లేని దరిద్రురాల నేను.

కమ్మని గుణాలు నీవి గానమ్ము సేయ
కంఠమందేని మధురమ్ము కలుగ లేదు
చిన్ని హృదిలోని భావాలు విన్నవింప
చతురతయె లేదు నాలోన సత్యదేవ !

దాన దక్షిణ లేదయ్య తమకు నిడగ
వట్టి హస్తాలతో నేను వచ్చినాను
పూజ చేసెడి క్రమమేని పూర్తిగాను
తెలుసు కోకుండ వచ్చితి, తెలుపవయ్య.

పూజచేసెడి సామాగ్రి పుష్పవితతి
తపు జారిణిగాను (?) నీ వెంచుకొనుము
దానదక్షిణ సద్భక్తి ద్రవ్యములును
ఈ దరిద్రురాలె యని ఊహించు కొనుము.

పిచ్చిదానిని లోభిని ప్రేమలోన
హృదయము పరీక్ష నేడు చేయించు కొరకె
నాదు సర్వస్వమర్పింప నీదుకడకు
అరిగితిని నేను దైవమా ! అందుకొమ్ము.

అర్పణ మ్మాయె నీ పవిత్రాంఘ్రి యుగళి;
స్వీకరించిన సరె ! నీవు వీలు లేదు
వల్లకా దనినెట్టి నప్పటికినైన
రామ ! నీదె ! ప్రేమించు తిరస్కరించు.

జంధ్యాల లలితశ్రీ






మా మేనత్తగారియింట గేదె యీనెను. ఆమె మాకు జున్నుపాలు పంపెను. మా అమ్మ మఱి కొన్ని పాలుకొని వానితో జున్నుపాలు కలిపి కాచి బెల్లమును యాలకుల పొడియు వేసి జున్ను చేసెను. నాడు యింటిలోని వారందఱమును జున్ను తింటిమి. మా అమ్మయు తినెను. మా కేమియు జబ్బు చేయలేదు. కాని జున్ను తినుటవలన మా అమ్మకు మాత్రము వాతముచేసి నడుము పట్టుకొని పోయెను. కదలమెదలలేకపోయెను. నడుమువంచి నేలమీదనున్న వస్తువు తీసికొనజాలకపోయెను. ఆ పూట పని మనిషి తోమిపెట్టిన చెంబులను అంట్లను తొలుచుట, నీళ్లు పట్టుకొనుట, బట్టలను ఆరవేయుట మొదలైన పనులన్నియు నేనే చేసితిని. వంగుటకును లేచుటకును సాధ్యముకానప్పుడు మా అమ్మ వంటమాత్ర మెట్లు చేయగలదు? మా కప్పుడు శీతకాలపు సెలవలు. కనుక బడికిపోవలసిన పనిలేదు. కాన మా అమ్మతో వంటగూడ చేయుదునని చెప్పితిని. మా అమ్మ అందులకు సంతోషించి అటులనే చేయుమమ్మా. మీ నాయనగారు ఊరిలో లేరుగదా. రాత్రి చేసిన పచ్చడులున్నవి, అన్నమొకటి వండిన చాలుననెను. వెంటనే నేను ప్రొయ్యిలో నిప్పువేసి కట్టెలు తగిలించి గట్టిగా విసరి గణగణ మండునట్లుచేసి దొడ్డిలోనికివెళ్లి స్నానముచేసివచ్చి మా అమ్మ పట్టుచీరను మడికట్టుకొంటిని. నేను స్నానముచేసి వచ్చునప్పటికి మా అమ్మ బియ్యముకొలిచి చేటతోచెరిగి గిన్నెలోపోసి పెట్టెను. బియ్యము ముందుగాకడిగి ఒడియవేసి యుంచుట వలన అన్నము చక్కగా ఉండునని మా అమ్మ చెప్పెను. కనుక నేను వానిని రెండుమూడు మారులు చక్కగాకడిగి వెదురుబుట్టలో ఒడియవేసితిని. అమ్మా! అన్నము వండుటకు ఎన్నినీళ్ళు ఎసరుపెట్టవలెనని నేనంటిని. మూడుపావుసేరులు బియ్యము పోసితివి కనుక ఆరుపావుసేర్లు నీళ్లు పోయుమని మా అమ్మ చెప్పెను. ఒకటికి రెండునీళ్లు పోయవలయునా? అని నేనడిగితిని. అవును మనవి మొలకొలుకులు, మఱియు పాతబియ్యముకూడ; కనుక ఒకటికి రెండునీళ్లు తప్పక పట్టగలవని మా అమ్మ చెప్పెను. అన్ని బియ్యములకు సమానముగా నీళ్లు పోయగూడదా అని నేనంటిని. కూడదు. కుసుమవగైరా సన్నరకములకు బొత్తిగా నీళ్లేపట్టవు. నీళ్లుపట్టని బియ్యము అన్నముగూడ ఒదుగుకాదని మా అమ్మ చెప్పెను.

నేను గిన్నెలో నీళ్లుపోసి ప్రొయ్యిపై పెట్టితిని. మంట గణగణ మండెను. ఎసరు మోతకు వచ్చెను. మా అమ్మ వెదురు బుట్టలో ఒడియవేసి ఉంచిన బియ్యమును ఎసరులో పోయుమనెను. అటులనేపోసి గరిటతో కలియబెట్టి మూతపెట్టితిని. అమ్మా! మాకు ప్రొద్దుటి అన్నము వండునప్పుడు తోడుతో బియ్యముకడిగి పెట్టుదువే, యిప్పుడు ముందుగా నీళ్లు ఎసరుపెట్టించితివేమి యంటిని. ఎక్కువ బియ్యమున్నప్పుడు ఎసరుపెట్టుటే మంచిది. మొదటనే బియ్యముకడిగి పెట్టిన చేతగాని పిల్లలు మంటసరిగా నలువైపుల తగులునట్లు వేయలేకపోయిన అన్నము చెడిపోవును. పెద్దవంటలు చేయువారందరు ముందునీళ్లు ఎసరుపెట్టియే అన్నము వండుదురు-అని మా అమ్మ చెప్పెను. అమ్మా! వడ్లన్నియు ఒకటికావా? అన్ని బియ్యములు ఒక మాదిరిగా ఉడుకవా అని నేనంటిని, అబ్బో! రెడ్లపేరులకు వడ్లపేరులకు లెక్కలేదని సామెత, మనదేశములో అనేక రకముల వడ్లున్నవి. వరిపంటకు మనదేశము ముఖ్యము. మొలకొలుకులు, కుసుమలు, అట్రగడ్డలు, రామసాగరాలు, కృష్ణకాటుకలు, కోణామణీలు, వంకసన్నాలు, సువర్ణరేఖలు,

డిల్లీభోగాలు, అక్కుళ్లు, కిచిడీలు, చిట్టిముత్యాలు, రత్నసుళ్లు, నెల్లూరు పిషాణీలు అని యింకా ఎన్నో రకముల పేరులుగల వడ్లున్నవి, అని మా అమ్మ చెప్పెను. సరళగారింట్లో బియ్యమునకు యిటువంటిపేరు లేదమ్మా. వారివి 24 నెంబరు బియ్యమట. అని నేనంటిని. అవును యిప్పుడు గవర్నమెంటువారు వడ్లకు పూర్వమున్న చక్కదనాల పేరులు తీసివేసి ఖైదీలకువలె నెంబరులు వేయుచున్నారులెమ్మా, అని మా అమ్మ నవ్వెను. మేము మాట్లాడునంతలో అన్నము ఉడుకుపట్టి కళపెళ మనజొచ్చెను. నేను గిన్నెపైనున్న మూతనుతీసి కిందపెట్టితిని, అమ్మా! గంజి వార్చవలనేమో, నేను వేడిగిన్నె పట్టలేనంటిని. అక్కఱలేదు మనవి పాతబియ్యము. నీళ్లు కొలతగా పోసితిమి వార్చనవసరాదు. మఱియు మీ నాయనగారు గంజివార్చిన అన్నములోని సారము పోవునని చెప్పుటచే నేనెప్పుడు గంజివార్చను అనెను. క్రొత్త బియ్యమైన వార్చవలెను కాబోలునని నేనంటిని. అవును కొత్తబియ్యపు అన్నము వార్చకపోయిన బాగుగా నుండదు. మఱియు క్రొత్తబియ్య పన్నమును వార్చకుండ తినినచో జీర్ణముకాక కడుపునొప్పివచ్చునని మా అమ్మ చెప్పెను. అన్నము యిగురుచుండెను. గిన్నెపై నిబ్బిని బోర్లించి మంటను తగ్గించి సన్నసెగపై కొంచెముసేపు ఉండనిమ్మా, అన్నము చక్కగా ఉమ్మగిలునని మా అమ్మ చెప్పెను. అటులనే కొంచెము సేపుంచితిని. ఇంతలో మా అమ్మ అమ్మాయీ! మూతలోనుండి ఆవిరి వచ్చుచున్నది. అన్నము యిగిరినట్లున్నది. గరిటెకాడ అన్నములో గ్రుచ్చిచూడుము. కాడ సళ్లుగాదిగిన యింకను నీరున్నదనియు, బిగువుగాదిగిన బాగుగా యిగిరినదనియు గుఱుతెను. మఱియు అన్నపు గిన్నెను తడిగానున్న తావున ఉంచిన చుయ్యమనిన బాగుగా యిగిరినదనియు చిటపటలాడిన అడుగంటినదనియు తెలుసుకొనవలెనని చెప్పెను. నేను వెంటనే అన్నపు గిన్నెను ఎండుటాకులతో పట్టి దించి తడిగానున్నచోట పెట్టితిని. చుయ్ మనెను. సరే బాగుగానున్నది మాడలేదులెమ్మా అని మా అమ్మ అనెను. అమ్మా! బొగ్గుల ప్రొయ్యి మీద వండిన అన్నము బాగుగా నుండునా? కట్టెల మంటమీద వండిన అన్నము బాగుగానుండునా అని నేనంటిని. బొగ్గులకుంపటిమీద వండిన అన్నము బాగుగానుండునుకాని, పెద్దపెద్ద వంటలు బొగ్గుల పొయ్యిమీద యెట్లు చేయగలము? కట్టెలప్రొయ్యి పెట్టుకొవలసినదే కాని మదరాసు, బొంబాయి, కలకత్తా మున్నగు పట్టణములలో కట్టెల ప్రొయ్యిలు పెట్టరాదని యుత్తరువులున్నవట. అక్కడ ఎంత వంటైనా బొగ్గుల ప్రొయ్యిమీదనే చేయుదురట. ఇంగ్లండు మొదలగు దేశములలో ప్రొయ్యిలే లేవుట. అంతయు విద్యుచ్ఛక్తి సహాయముతోనే చేయుదురట. ఈ ప్రొయ్యిలు ఈ పొగ ఈ గొడవంతయు మనదేశములోనే. అక్కడ ఒక్క స్విచ్ నొక్కితే చాలు నిముషములో నీళ్లు కాగును, పాలు కాగును, భోజనపదార్థములు తయారగునని, మా తమ్ముడు చెప్పుచుండును. వాడు యింగ్లండులో మూడేండ్లున్నాడని మా అమ్మ చెప్పెను.

భోజనము చేయుచుండగా క్రొత్తదైనను అన్నము బాగుగనే వండితివని మా అమ్మ మెచ్చుకొనెను. నేను సంతోషముతో రేపు కూరచేయుటగూడ నేర్చుకొనెదనంటిని. మా అమ్మ సంతోషముతో నవ్వుచు నా తల నిమిరెను.

స్థాలీపులాకన్యాయము—ఒక్క మెతుకుపట్టిచూచిన అన్నమంతయు నెట్లున్నదో తెలిసినట్లు, మనిషి యొక్క ఒక్క చేష్టను బట్టియే వారి స్వభావమంతయు తెల్లమగును.

అన్నమంతయు పట్టిచూచెదమా?

కనుపర్తి వరలక్ష్మమ్మ

—:♥:—

# బ్రతుకు తెరువు



## అగ్గిపుల్లలు చేయుట — గృహపరిశ్రమ



మద్రాసు ప్రభుత్వమువారు అగ్గిపుల్లలుచేయుటను గృహపరిశ్రమగా పెంపొందింప ప్రయత్నింపనున్నారనియు, ఇందుకై సహకారపరపతిసంఘము లేర్పరతురనియు ఒకవార్త ప్రకటింపబడినది. ఇది గృహలక్ష్ములకు శుభవార్త. ఇందువల్ల వారికి ఇంటినుండి కదలవలసిన అగత్యములేని బ్రతుకుతెరువు మరొకటేర్పడును.

ప్రభుత్వమువారు తమస్కీము వివరములను పూర్తిగా ప్రచురింపలేదు. సహకార పరపతి పద్ధతి నవలంబించెదమన్నారు. కాబట్టి - మన మూహింపవచ్చును. ముందుగా వలయువారికి అగ్గిపుల్లలమందుచేయుటను ఆ మందును పుల్లలకంటిరించుటను నేర్పుదు రనుకుందును. ఇందు కొక్కవారము తర్ఫీదుచాలును. ఆ పిదప - ఇష్టమున్నవారిని సహకారపరపతిసంఘముగా చేర్చెదరు. ఆ సంఘమునకు కొంతధనము నివ్వవచ్చును. బహుశా ఇందుకవసరమైన వస్తుసామగ్రియు సరఫరాచేయవచ్చును. ఇంటింట—అగ్గిపుల్లల కవసరమైన - పుల్లలను - మిల్లులో చక్కగా కోసిక త్తిరించిన తేలిక కలప పుల్లలను పంచుదు రనుకుందును. మరియు అగ్గిపెట్టెలను వానికిబంధముగా నంటించవలసిన కాకితపు పేలికలనుకూడా సప్లయిచేయవచ్చును. లేదా ఆపని విడిగా కార్ఖానాలో జరుపవచ్చును.

అప్పుడు ఇంటింట రోజురోజు - అగ్గిపుల్లలమందు తయారుచేసి పుల్లలకొనలకు మందుపట్టించి, ఆరబెట్టి, నిర్ణీతసంఖ్యానుసారము పెట్టెలలో పుల్లలమర్చి, మూడిచి, పైన కాకితపుపేలిక లంటించవలయును కాబోలు.

ఈ పని స్త్రీలు, ఊహవచ్చిన బిడ్డలు, వృద్ధులుకూడ చేయదగినది. ప్రతిరోజును ఒక్కొక్క ఇంటిలో సుమారొక గ్రోసుపెట్టెలకగు పుల్లల తయారుచేయవచ్చునేమో! అయితే ఇల్లాండ్రు చాలజాగ్రత్తతో నుండవలయును. అగ్గిపుల్లలమందులో గంధకము చేరుచున్నది. ఇది విషవస్తువు. చిన్నబిడ్డలు నోటికంటించుకొనకుండ జాగ్రత్త అవసరము. మరియు నిది మండుస్వభావముకలది. నిప్పుఅంటకుండ చూడదగును. పుల్లలు వేడి

గాలిలో - ఏమాత్రము రాచుకొన్నను భగ్గునమండగలవు. ఆ విషయమున జాగ్రత్త వహింపనగును.

త్వరలో చెంగల్పట్టుజిల్లాలో—ఇందుకై ముందుగా—నొకచో సహకారపరపతి సంఘముస్థాపించి—సాధకబాధకము లరయుదురట. అప్పుడు దీని పూర్తివివరములు తెలియనగును.

స్వతంత్రముగా గృహస్థులు తమతమ యిండ్లలో నీపరిశ్రమనవలంబించుటకును అవకాశమేర్పడవచ్చును. గంధకపువంటకముతో కూడిన విషయముగావున నీపరిశ్రమ ప్రభుత్వమువారి అనుజ్ఞల జరుగవలసియుండును. అందుకై లైసెన్సు నేర్పరచినను, అది సామాన్యగృహస్థులకు నందుబాటులోనుండదగును. కేవలమిట్టివారి జాబితా తయారొనర్చుట వీలుకల్గించుటకు మాత్రమే నామకః లైసెన్సు రుసుమేర్పరుపవచ్చును. అవసరమైన ఆ ఉత్తరువు నుల్లంఘించిన హెచ్చుజుల్మానా వేయవచ్చును.

ఆ విధముగా కూడ నిది చక్కని బ్రతుకు తెరువు. పుల్లలనుమాత్రము తయారుచేసిన పేదవాండ్రు పాతపెట్టెల నింపుకొనివెళ్లుదురు. ఒకపెట్టెను జాగ్రత్తగా వాడిన రెండు మూడు నెలలు వాడవచ్చునేమో! మరియు నీపుల్లలకు నేడు మిల్లులవారుహాడే ప్రత్యేకపుకలప దూరస్థలమునుండి తెప్పింపవలసియుండునుకదా. మనకు సులభముగ లభ్యము కాగల—పూచికపుల్లలు, కొంకాయఈనెలు, వెదురుపేళ్లపుల్లలు—ఉపయోగింపనగునేమో పరీక్షింపదగును. అట్లగుచో ఆయావానికి కొంతగిరాకీ యేర్పడవచ్చునుగాని—అసలు అగ్గిపెట్టె చౌకయగునేమో!

పాఠశాలలయందును నిదియొక గృహపరిశ్రమగా పెద్దక్లాసుబిడ్డలకు నేర్పవచ్చును. ముఖ్యముగా బాలికాపాఠశాలలలో అవశ్యము నేర్పదగినది.

సామాన్యముగు కుటుంబమున వారమునకొక అగ్గిపెట్టె ఖర్చగును. ఇక నాయింట బీడీ, చుట్ట, సిగిరెట్టులవెల్గించు ఘనులున్నారేని రోజుకొక్కపెట్టె యగునేమో! విస్తారముగా ఖర్చగువస్తువు. ఒక్కసారి కాల్చినపుల్ల మరి ఉపయోగింపదు. సమీపస్థమగు ఆసియాదీవుల కెగుమతి అవకాశముకూడా గలది కావున ఈ పరిశ్రమను కుటీరపరిశ్రమగా నేర్పరచి గృహలక్ష్ములకు బ్రతుకుతెరువు మార్గము చూపనున్న మద్రాసు ప్రభుత్వమును ఇందుకు అభినందించవలసియున్నది.

---

# ఇంటిపనులలో మెళకువలు

## తల్లిప్రేమ, శిశుపోషణ



శ్రీమతి కె. సత్యవతమ్మగారు



బిడ్డల ఆరోగ్యానికి, అభివృద్ధికి కర్తలు తల్లిదండ్రులు కేయని ప్రతివారికి తెలిసినదే. అందునను తల్లి ముఖ్యముగా బిడ్డలసంరక్షణ, బిడ్డలముద్దుముచ్చటలు చూచుట ముఖ్యావసరములుగా గ్రహించవలెను. తండ్రి బైటపనులలో (అనగా) వుద్యోగ, వ్యాపారములలో అనేకకష్టనష్టములకుగురియై, చీదరించుకుంటూ, యింట్లోప్రవేశించడమే తడవుగా, ఆ కోపతాపములు యింట్లోయిల్లాలిపైనా, బిడ్డలపైనా చూపి, కారణములులేనికలహములు ప్రారంభించి, ఏదోవిధముగా భార్యను రాపాడి, తనకష్టనష్టములు కలిసివచ్చునా అని ఆలోచించక, భార్యనుచావగొడతాడు. ఆ భార్యచేయునదిలేక యింటిపనులగురించికాని, బిడ్డల ఆకలిదప్పులనుగురించికాని, ఆలోచించక, అదొక పెద్దకారణముగా మునుగుతన్ని పెట్టిన, ఆ బిడ్డలగతేమిటి? పాపము, ఆ పసిపాపలు ఆ తల్లిదండ్రులపోట్లాటల్లోనలిగి, తిండితిప్పలులేక, ఎక్కడివాళ్లక్కడ సొమ్మసిల్లిపడివున్న, వాళ్ళను ఆదరించేవాళ్లెవరు? తల్లేచూడకపోయిన ఆ బిడ్డలగతేమిటి? కాన మగవాళ్ళ చికాకుపరాకులకు మనము పౌరుషపడక బిడ్డల ఆరోగ్యసౌభాగ్యములను కాపాడుకొన్న, ఆ బిడ్డలేమనకును, మనదేశమునకును సహాయపడగలరు. మగవారిమనస్సులు క్షణచిత్తములు. రోజుకొకమాదిరిగాను, గంటకొక రకముగాను మారుచుందురు. అదికూడా మన పురాకృత సుకృత, దుష్కృతములనుబట్టే వుండును. వారివారి రాబడి, ఖర్చులనుబట్టి, కష్టనష్టములనుబట్టి, ఒకప్పుడు సంతోషముగాను, మరొకప్పుడు చికాకుగానువుండి, వాటికి యింటియిల్లాలే కారణముగా కల్పించుకొని, తిట్లో, కొట్లో బాధలుపెడతారు. వాటిని ఎంతో ఓర్పుగా ఆ తల్లే భరించాలిగాని, నోరులేని బిడ్డలపైనచూపిన, ఆ పసివాళ్లు ఏమిచేయగలరు? బిడ్డలపైన తల్లిప్రేమ ఎప్పుడును ఒకేమాదిరిగానుండును. అన్నిరకములప్రేమలలోను, తల్లిపిల్లలప్రేమ విలువలేనిది. బిడ్డలు ఏలాగున్ననూ, ఏమిచేయుచున్ననూ, తనివితీరా ఆ బిడ్డలనుచూచుకొని ముచ్చటపడుతుంది. ఏబిడ్డకు ఏమియిష్టమో, ఏబిడ్డకు ఏమికావాలో యనేధ్యాసతోనుండే ఆతల్లిని, యింట్లోఖర్చు ఎక్కువఅగుచున్నదని తను ఎంతోకష్టపడవలసివచ్చుచున్నదని, ఆ తండ్రి ఎంతవిసుగుకొన్ననూ, బిడ్డలగురించి ఎన్నిచీవాట్లైనా భరించి, కలిగినదానిలో బిడ్డలకు తృప్తిపరచాలని చూస్తుంది ఆతల్లి మనస్సు.

తల్లి అనే ప్రతిస్వరూపములోను, (అనగా) జంతువులు మృగములు మొదలగు అన్నింటిలోను, ఆతల్లిప్రేమ వుండును. మగవారిమనస్సులు అతికఠినములు. యింటిఖర్చునుగురించి, అయినదానికి కానిదానికి, యిల్లాలిని బాధించాలని చూడడమేకాని, భార్యాబిడ్డల ఆరోగ్యభాగ్యములే యింటికి ఆనందమని ఆలోచించడు ఆ పిసినిగొట్టుతండ్రి. భర్తఎన్నివిధములుగా బాధించుచున్నను, తనశక్తిని బట్టి, యింటిపరిస్థితినిబట్టి, ఎంతోఓరిమితో, ఆ సంసారమును చక్కగానడిపి బిడ్డలయొక్క, భర్తయొక్క ఆరోగ్యములకొరకు తాపత్రయపడుతుంది ఆ యిల్లాలు. కాన బిడ్డలవిషయములో ఎక్కువబాధ్యత తల్లిదైనా, తండ్రికూడా, ఆ భార్యాబిడ్డలను, జాగ్రత్తతీసుకొని, మిక్కిలి వుత్సాహముగా చూచిన

ఆ సంసారము చూచుటకు ఎంతో ఆనందముగానుండును. యిల్లాలి మనస్సు విసవిసలాడిన, యింట్లో ఏమి సంతోషము వుండదనే సంగతి ప్రతిమానవుడు గ్రహించవలెను.

యింకొక సంగతి. బిడ్డలయెడలనుండే ప్రేమాభిమానములకొద్దీ, యింట్లో యిబ్బందిపడుతూ, ఎక్కువ ఆడంబరముగా ఖర్చులు పెంచకూడదు. యింటియజమాని సంపాదననుబట్టి, మనము మనబిడ్డలు తృప్తిపడవలెనే కాని రాబడినిమించి ఖర్చుచూపిన ఆ మగవాడు చేయునదిలేక ఎక్కువగా యాతనపడి, సంసారమునుండితొలగి, సన్యసించడానికికూడా సిద్ధపడగలడు. కాన ప్రతిఆడది, తనయజమానియొక్క సంపాదనను గ్రహించి, క్లుప్తముగా సంసారమునడుపుతూ, ఆరోగ్యములకు భంగమురాకుండా జాగ్రత్తగా బుద్ధిని వుపయోగించవలెను. సంసారముగుట్టు ఎవరికితెలియనివ్వకూడదు. అందువల్ల వెలితికావడమేకాని, లేదంటే పెట్టేవాళ్లువుండరు. యింటిపనలలో ఎక్కువ పనిమనుష్యులమీద ఆధారపడివుండకూడదు. అందువల్ల డబ్బు ఖర్చేకాకుండా, వాళ్లుచేసినపనులు మరల మనము సవరించవలసివచ్చును. అంతకంటె మనము చేసుకోవడమేమంచిది. మనయింటిపనులు మనము చేసుకోవడము ఏమీతప్పులేదు. కొన్నియిళ్ళలో యింటినిండా పనిమనుష్యులువున్నారంటే ఎంతో గొప్పగా గర్వపడతారు. ఏ స్వల్పపనికైనా పనిమనిషే రావాలి, చెయ్యాలి. అంతేకాని, ఆ మాత్రపుపని మనవల్లకాదా? మనము చేసుకోకూడదా? అటువంటి కుటుంబాలు (అనగా) పనిమనుష్యులమీద ఆధారపడివున్నవారు ఎన్నిరకములపాడగుచున్నారో? వారి శరీరములుకూడా బరువెక్కి, ఆరోగ్యములుకూడా పాడుచేసుకొనుచున్నారు. ఏమంటే, తినికూర్చుంటే, తిన్నది జీర్ణముకాదు. కాన మనశక్తినిపట్టి మనపనులు మనము చేసుకోవడము మనశరీరములకు మిక్కిలి ఆరోగ్యము. ఇక బిడ్డలపోషణలోకూడా చాలా జాగ్రత్తతీసుకోవలెను. బిడ్డలవయస్సునుపట్టి చిన్నచిన్నపనులు ముద్దుగా చేయించవచ్చును. బిడ్డలత్రాణకుమించి ఏపనిచెప్పకూడదు. అలాగు బిడ్డలవయస్సునుమించి పనులు చేయించుకున్న, ఆబిడ్డలు ఆరోగ్యముపాడగుటయేకాక అపాయముకూడావచ్చును. కాన చిన్నిపనులు, శుభ్రముగా, శుచిగాచేయడము-మెల్లిగానేర్పిన, పెద్దవాళ్ళయేసరికి, మంచినేర్పుగా వాళ్ళసంసారము వాళ్లు చేసుకోగలరు. పనిముద్దుకాని, భాగ్యము ముద్దుకాదు.

బిడ్డలకు ఆటపాటలలో ఎక్కువ విశ్రాంతియివ్వవలెను. వాళ్లుచేసే ప్రతిపని మనము చూచుచుండవలెను. తప్పులుకనిపెట్టి, నేర్పుగా వాళ్లచేతచేయించవలెను.

బిడ్డలకు పప్పుపదార్థములు ఎక్కువగావాడిన అజీర్ణమువల్ల, బాధపడగలరు. విరివిగాదొరికిన గోధుమలతో ఎన్నిరకములుగానైన చేయవచ్చును. ఎక్కువబలము ఆరోగ్యము; కాని ప్రస్తుతానికి దొరకడము కష్టము. గోధుమకుబదులు, బియ్యమునూక, బియ్యముపిండితోకూడా అనేకరకములుగా, చేసిపెట్టవచ్చును. ఎక్కువ, బెల్లం, ఎక్కువకారముకాకుండా, కమ్మనిపదార్థములు బిడ్డలకురుచించును. మనము ఎక్కువ శ్రద్ధతోను, ఆ చేసేపనియందే దృష్టితోను చేసిన, ఆ వస్తువుచాలా బాగుగావుండును. కాన బిడ్డల ఆరోగ్యములకొరకైనా ఎక్కువశ్రమకు ఓర్చి, బిడ్డలకు ఏమికావలసినా చేసిపెట్టవలెను. యింటియజమానిగారినికూడా, కాఫీహోటల్స్‌కుపోకుండా, వారికికూడా యింటివద్దనే ఏర్పాటుచేసిన, వారి ఆరోగ్యముకూడా బాగుగానుండును. కాని కొందరికి యింటివద్ద తృప్తివుండక హోటలుకుపోవాలనేబుద్ధివుండును. అన్నింటికి వారి ఆరోగ్యపద్ధతి. సమర్థులుగాన వారిపైనే వుంచవచ్చును.




గత గృహలక్ష్మి పత్రికలలో శిశుశరీరవ్యాధి నిర్ణయము, లక్షణములు చాలా వివరముగా తెల్పియున్నాము. ప్రతితల్లియు శిశువ్యాధి చికిత్సను, వ్యాధిస్వరూపములు కడుజాగరూకులయి గమనించుచుండవలయును. శిశువ్యాధులుకూడ నిర్ణయించుటకు వైద్యశిఖామణులకన్న చాతుర్యము, పరిశీలనాశక్తి అనుభవముగలతల్లి మిన్నయని చెప్పక తప్పదు. అందులో ఈమాసము పత్రికలో వ్యవహరింపబోవు పిట్ట పారుట-పక్షిపారటము అంటారు. Rickety (అంగవికారము) లివరు & స్ప్లీనువ్యాధుల నిర్ణయము కడుసులభము కాదు. గాన ఔషధమునకంటే శిశుస్వరూపము, వేదన, కృశించుట మొదలైనవాని కారణములు తెలుసుకొనుట ముఖ్యము.

14 పిట్టపారుట :-శిశుప్రాయము మూడుమాసములు దాటినప్పటినుండి సామాన్యముగా యీ వ్యాధి అంటిపెట్టుకొనియుండును. అందులకు సులభ చికిత్సయొకటి అనుభవ సిద్ధమైన దానిని ప్రతి గృహలక్ష్మియు తెలుసుకొనుట అవసరము. 5 తులముల మెంతులను శుభ్రపరుచవలయును. అటుపైన వానిని తగురీతిన వేయించవలయును. తదుపరి 10 పలముల మంచివెన్న కాచిననెయ్యిలోపోసి శుభ్రమయిన సీసాలో వేసుకొని వుంచవలయును. వడియగట్టి మెంతులను తీసివేసి ఆనేతిని సుమారు స్పూను చొప్పున రోజుకు రెండు పర్యాయములిచ్చిన చాలును. శుష్కించిన అవయములకును, పొట్టకును తలకునుకూడ రాయవచ్చును.

మరియు మెంతిమోదకముకూడాచేసి 5 సంవత్సరముల వయస్సు మించిన బిడ్డలకు కూడ ఇవ్వవచ్చును.

త యా రొ న ర్చు వి ధా న ము.

మూడు కరక్కాయలపై వలపుయొక్క చూర్ణము మెంతి 2½ తులము

| | | | |
|---|---|---|---|
| శొంఠి | ½ తులం | మిరియములు | ½ తులం |
| పిప్పలి | ½ ,, | ధనియాలు | 1 ,, |

| | | | |
|---|---|---|---|
| వాము | 1 తులం | జాజికాయ | 1 కాయ మంచిది (పుచ్చినదికాదు) |
| సముద్ర లవణము | 1 ,, | | |
| ఏలక్కాయలు | 1 ,, | జాపత్రి | ½ తులం |
| లవంగములు | ½ ,, | హారతికర్పూరము | ½ ,, |

వీటి నన్నిటిని చూర్ణించి, బాగా వస్త్రకాళితముచేసి సుమారు 3 గ్రెయినుల చూర్ణమును మంచితేనెలోకల్పి రోజుకు రెండుపర్యాయములు యివ్వవచ్చును. ఏ కారణము వల్ల యీ వ్యాధి ప్రకోపించి బిడ్డశరీరము క్షీణించిననూ నెమ్మదియగును.

మరియు స్నానచూర్ణముగాకూడ మెంతులను ఉపయోగించిన శరీరమృదుత్వము, కాంతి, కేశాభివృద్ధియగును

15. లివరు ఆ స్ప్లీను : ఈ వ్యాధి సామాన్యముగా -జ్వరాది వ్యాధులచే పీడింపబడు శిశువులకు సరిగ చికిత్స, ఉపచారములు, ఆహారపోషణ నిద్రా విహారములులేని పిల్లలకు వ్యాధిని నిరోధించుకొను శక్తిలేని వారలకు యీ వ్యాధి సంభవించును. సంభవించినది మొదలు పిల్లలు బాధపడుటయేకాక తలిదండ్రులు, డాక్టర్ల బిల్లులు చెల్లించుకొనలేక సంసారములలో విసుకు చెందుచున్నారు. ముఖ్యలక్షణములగు పొట్ట పెద్దదగుట, పాండువర్ణముగ శరీరము మారుట, పొట్టపైన నులకతాడు మాదములో పచ్చని నాడులు అగుపడుట, మొదలగునవి కనుపించిననూ తగుజాగ్రత్త తీసుకొనక కాలయాపన చేయుదురు. ఇట్టి పిల్లలవద్దకు, ఈగలు, పురుగులు, చీమలు చేరుచుండును.

ప్రాణపోషక పదార్థము (Vitamin) డి తగ్గిపోయినందువలననే యీ వ్యాధి అంకురించును. అన్నబేధి యనునది సామాన్యముగా అందరకు తెలిసియుండును. దీనినే కాశీస భస్మమనికూడ చెప్పుదురు. భస్మము చేయుట సులభము. లేదా ఆయుర్వేదౌషధములు విక్రయించు వైద్యులవద్ద వైద్యేశ్వరులవద్ద లభించును. దీనిని తడవకు రెండు గ్రెయినులు, తేనెలో కల్పియిచ్చిన మేలగును. వేడిచేయదు. దీనినే మెర్రమందు అని వైద్యులు గూఢముగ వాడెదరు.

మరియొక చికిత్స: శంఖములు అందరికి తెలియును. శంఖములో గొప్ప శక్తి కూడ కలదు. వీటిని పలుకులగునట్లు పగులకొట్టి చాలినంత నిమ్మకాయ రసములో పూరనిచ్చి బాగుగా కడుగవలయును. అటు పిమ్మట ఆరపోయవలయును. వాటిని మూకుడులోగాని యినుపబాణలిలోగానివేసి బాగుగా బొరుగులగునట్లు పలుకుపోవునట్లు వేయించవలయును. వాటిని కల్వములోపోసి మెత్తగా భస్మము చేయువలయును. వస్త్రకాళితము చేయవలయును. ఎంత సూక్ష్మీకృతమయిన అంత మేలు. తయారయిన దానిని తేనెలోకల్పి 2 గ్రెయినుల చొప్పున తడవకు యివ్వవలయును. వ్యాధి కఠిన తరమని తోచినయెడల కొద్దిగ త్రికటు చూర్ణముకూడ చేర్చవచ్చును. దీనికి కొందరు తెల్లమందు అని వాడుటకూడకలదు.

శిశువివాహనిరోధక శాసనాధిష్ఠాత

# హార్ బిలాస్ సర్దా గారు

శ్రీయుత వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు బి. ఏ., బి. యల్.

(గతసంచిక శేషము)

(1) నలభై కోట్ల జనములో ఏమూలనో యే బ్రాహ్మణ సంప్రదాయము ననుష్ఠించు బహుస్వల్పసంఖ్య కిది నిరోధముగనుండును కాబోలు - అట్టివారును శాసనములో సరిపడి పిల్ల పెద్దదిఅయినదే పెండ్లికాలేదే అనుకొనువారు యరిది యగుచున్నారు.

(2) సనాతనధర్మముల నుద్ధరించిన సత్యకాలములలో పిల్ల పెద్దమనిషిఅయినదనగనే నాలుగైదు దినములు సమర్తబెట్టుటయను పండుగలు జేసి కొంచెమించుమించుగ పెండ్లి అంతవ్యయము జరుగుచుండెడిది. దడిబము వేడుకలు అమితముగ జరుగుచుండెడివి. ఇపుడీ సమర్తబెట్టుట, దడిబము వేయుట, మరి రాద్యలంకారములుచేయించు టనుటయే లేదు. తుదకు పిల్ల ప్రథమ రజస్వల అయినప్పుడును మేళముకూడ పెట్టువారగపడరు. వ్యయభాగమున సంసారమున కీవిధముగ అనుక్తమలాభము కలుగుచున్నది.

(3) పూర్వపు పద్ధతులప్రకారము పెండ్లిఅయిన పిల్ల వ్యక్తురాలయినపిదప గర్భాధానమను నొక వైదికక్రియ మహావిభవముతో పెండ్లితోసమానముగ జరుగుచుండెడిది. ఇపుడు గర్భాధానము మంత్రికముగనైన జరుగుచున్నదియో లేదో విచారణీయముగనున్నది. అర్థాత్ సమావేశము (గృహప్రవేశము) అను క్రియయందే గర్భాధానమంత్రములన్ని వల్లింపబడుచున్నవి. కావున గర్భాధాన ప్రసక్తమయిన వ్యయమును తగ్గిపోయినది. పెండ్లికి కట్నమడిగినటుల గర్భాధానమునకు వచ్చుటకును కొన్నియెడల దశమగ్రహములు వక్రించి అత్యధికములగు శాంతిక పౌష్టికముల బలాత్కారముగ కోరుట గలదని వినుచుండుదుము. అట్లున్నను ఆ నిర్బంధము-బలాత్కారము. సర్దాశాసనముయొక్క వ్యాప్తియనతగదు. ఇట్టి నిర్బంధమును చేయు మహాపురుషులు సర్దాఆక్టుకు ముందును గలరు. సర్దాఆక్టును ప్రోత్సహించి అభిమానించిన పురంధ్రీమణులు వరకట్నముల నిరోధము నెడలగూడశాసనము జేయింప బూనుకొనదగుదురు.

సంఘసంస్కరణపక్షమునను నవీన శాసననిర్మాణపక్షమునను వీరి యావేశము శిశువివాహనిరోధశాసనముతో సమాప్తము కాలేదు. లోకసంగ్రహణార్థము, మరికొన్ని ప్రయత్నములును లెజిస్లేటివ్ అసెంబ్లిలో జేసిరి:

(1) అజమేరు మార్వాడా పరగణాలోపలి పసిబాలుర చుట్ట, బీడి, సిగరెట్టులోనగు ధూమపాన ప్రయోగము జరిగింపకుండ నిరోధించుటకొక శాసనమును ప్రవేశబెట్టిరి. అది అసెంబ్లిలో జయమునుబొంది అంగీకృతమయినది గాని కడకు స్టేటు కౌన్సిలువారివలన నిరాకరింపబడి వ్యవహారములోనికి రాలేదు.

(2) హిందూకుటుంబపు సొత్తులో హిందువితంతువున కొంతహక్కు కలిగియుండవలయునని యొక శాసనమునుకూడ అసెంబ్లిలో ప్రవేశబెట్టిరి. అయితే అప్పటి పరిస్థితులలో గవర్నమెంటువారే దీని నభిమానింపనందున అదియు శాసనముకాలేదు. ఈవల ఈవిషయములో తిరుగ ప్రచారముగలిగి సర్దాగారిభావములు కొంతవరకు ఊర్జితములైనవి.

వీరు లెజిస్లేటివ్ అసెంబ్లిలో యూరక అలంకారపుష్టిగ కూర్చుండువారుకారు. ప్రఖ్యాత పురుషులు. వీరు నిర్వహించిన లోకసంగ్రహప్రసక్తములు, లోకోపకారములగు గొప్పపనులకు వీరు ఎక్కువగ సర్కారులో సన్మానింపబడి బిరుదములబొందిరి. 1914 లో పెట్టిన గొప్పప్రపంచయుద్ధము (Great War of 1914) కాలమున వీరు అజమేరు మార్వాడారాష్ట్రమునకై యేర్పడిన పబ్లిసిటి బోర్డుకు (నానాటి యుద్ధసంగతులు రాజకీయసంగతులు ప్రజకు వెల్లడిచేయు సమితి) హానరెరి కార్యదర్శిగనుండి శ్లాఘ్యమ్ముగ ఆ యుద్యోగమును నిర్వహించిరి. (హానరెరి అనగ జీతముగాని ఇతర వేతనముగాని లేక ఆయాహోదాలకు సంబంధించిన అధికారముల సాగించు పదవి) ఈ యధికారనిర్వహణమును మెచ్చి సర్కారువారు వీరికి రాయ్ సాహెబు (Rai Saheb) బిరుదమును ప్రసాదించిరి. తరువాత వీరు లెజిస్లేటివు అసెంబ్లిలో నెరవేర్చిన గొప్పపనులను ఆమోదించుచు 1931 లో వీరికి "దివాన్ బహదర్" బిరుదము నర్పించిరి.

వీరు గొప్పవిద్వాంసులు - విమర్శకులు - వాగ్మియు - వావదూకకుశలతచే నొప్పినవారు. వీ రనేక గ్రంథముల నింగ్లీషులో రచియించిరి. వానిలో కొన్ని యీక్రింద పేర్కొనబడుచున్నవి —(1) హిందూ సర్వాతిశాయిత్వము (హిందూసుపీరియారిటి) (2) అజమేరు - (చారిత్రకదృష్ట్యా-వర్ణనదృష్ట్యాయును) (3) మహారాణా కుంభ (4) మహారాణా సాంగా (5) మహారాజా హమ్మీర్ ఇత్యాదులు. మొదటచెప్పిన గ్రంథమున, ప్రాచీన హైందవులు నాగరకతావిషయమున నేమి, సంస్కృతి (కల్చర్) విషయమున నేమి లోకోత్తరమగు నౌన్నత్యమునుబొందియుండిరని నిరూపించియున్నారు. రెండవదియగు అజమేరు భాగవత షష్ఠస్కంధమున ముమూర్షుస్థితిలో నారాయణ నారాయణ నారాయణయనుచు నాత్మనందనునొడివిన అజామిళునివలన నీపేరుపుట్టినదను నానుడి సరికాదని స్థాపించి అజయుడను నొక రాజపుత్రస్థానపు రాజు తనపేరనొకపట్టణము నిర్మించి దానిమేరు పర్వతమువలె స్వర్ణమయము చేయవలయుననియుద్దేశించి దానికి అజయమేరు లేక అజమేరు అనుపేరు పెట్టినాడను మొదలగు చారిత్రక విమర్శక విషయముల గలిగియున్నది. మిగిలిన మూడును తత్తన్నామక పురుషవరేణ్యుల ప్రసక్తులు గలిగియున్నవి .. వీరి గ్రంథములన్నిటిలో మొదటిదిఅయిన "హిందూఔన్నత్యము" వీరి విద్యాధికతకు, విమర్శశక్తికి, పరమ ప్రమాణమై వీరి కీర్తికి ముఖ్యస్థానమగుచున్నది.

వీరు గ్రంథరచనజేసినదేగాక ఇండియన్ ఆంటిక్వరి, గ్రేటు బ్రిటన్ ఐర్లాండ్లయొక్క రాయల్ ఏషియాటిక్ సొసైటివారి జర్నల్ లోనగు ప్రసిద్ధపత్రికలకు విద్యావిషయకముగను విమర్శవిషయకముగను గొప్పగొప్ప వ్యాసములవ్రాసిరి. 1921 సంవత్సరమున పూనాపట్టణమున జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సు ముఖమున ఒక వ్యాసమునుచదివిరి. మరియు గ్రేటు బ్రిటన్ అండు ఐర్లాండుయొక్క రాయల్ ఏషియాటిక్-సొసైటి ఆఫ్ లిటరేచర్ సభకును, గ్రేటుబ్రిటన్ అండు ఐర్లాండుయొక్క ఏషియాటిక్ సొసైటిసభకును యునైటెడ్ స్టేట్సులోనుండు బోస్టన్లోని స్టాటిస్టికల్ సొసైటికిన్ని, గ్రేటుబ్రిటన్ అండు ఐర్లాండు టీచర్సు గిల్డుకున్ను సభ్యులుగా ఎన్నుకొనబడిరి. గ్రేటుబ్రిటన్ అండు ఐర్లాండుయొక్క అర్కియోలాజికల్ ఇన్స్టిట్యూటుకును అసోసియేటుగా గ్రహింపబడిరి.

గడచిన జూన్ నెలలో శ్రీ సర్దా గారు సహస్రచంద్రదర్శనముజేసిన పుణ్యాత్ములైరి. సహస్రచంద్ర దర్శనమనగ జననకాలముననుండి వెయ్యిచాంద్రమాణముల గణింపవలసియుండును. వెయ్యిచంద్రోదయములగును. వెయ్యినెలలు 83 సంవత్సరముల 4 నెలలు అగుచున్నది. వీరి జననకాలము 1867 జూన్ నెల తే 3 ది అయియుండగ ఇప్పటికి ఎనుబదిమూడేండ్లు నాలుగుమాసము లెట్లగునని యడుగవచ్చును. భారత విరాటపర్వమున ఉత్తర గోగ్రహణ ఘట్టమున పాండవుల అరణ్యాజ్ఞాతవాసములు కలసి పదమూడేండ్లు

గ్రిహలక్ష్మి

ఇంకను నిండదనిదియు అర్జునుడు అజ్ఞాతవాస కాలనియమభంగముజేసి ప్రకాశముగ స్వస్వరూపమున యుద్ధమునకు వచ్చినాడనియు, నియమభంగమయినందున తిరుగ వారు వదమూడేండ్లు అరణ్యాజ్ఞాతవాసముల జేయవలసియున్నదనియు దుర్యోధనాదులకు సందేహము కలుగగ భీష్ములవారా సందేహము నిట్లు నివారించిరి:—

పంచమే పంచమే వర్షే ద్వౌ మాసావుపజాయతః
ఏషామ భ్యధి కామాసాః పంచ చద్వాదశక్షపాః"

ఇత్యాది జ్యోతిషప్రమాణముల జూపి సందియము వారించిరి (కలకత్తా ప్రతి మహాభారత విరాట పర్వ అ. 52).

ఈ విషయమునే తిక్కయజ్వ తెలుగున జూపియున్నారు: విరాట. అ. 4 చూడుము.)

రెండవయేట నొక్కఁడధి మాస మిట్లెక్కిన యన్నెలనెల్లగూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక నిన్నటితోడన నిండె...

ఈ విధమున గణితముజేయగ ఇప్పటికి శ్రీ సర్దాగారికి వెయ్యినెలలపైన అరగుచున్నవి. కాబట్టి వీరు సహస్ర చంద్రదర్శనబొందిన పుణ్యాత్ముల నొకరగుచున్నారు. సహస్ర చంద్రదర్శనమువలన కలిగిన ఫలమును తిక్కన సోమయాజి భారతానుశాసనికమున నిట్లుపదేశించియున్నాడు.

"* బహు సుతుండు నతి కృపాన్వితుడు
వెయ్యినెలలపై బ్రతికినతడుఁ గంద్రు త్రిదశపదము.

1937 లో వీరి షష్టి పూర్త్యుత్సవజ్ఞాపికగ వీరి మిత్రులును ఆమోదకులును వీరియం... గౌరవాతిశయముగల హితపరులును బహుకర్తృక సముచ్చయగ్రంథ సమర్పణ గౌరవమును గావింపబడినది. (Commemoration Volume).

వీరికిపుడు వార్ధక్యమున బాధిర్యదోష మాపాదించినను మిత్రగోష్ఠీసంభాషణములు జరిగించుచునే యుందురు. వీరింకను చిరాయురారోగ్యసంపదలచే చెన్నలరారి లోకహితార్థప్రవర్తకు లగుచుందురుగాత!

(సమాప్తము)

---

[సవరణ: గతసంచికయందు దివ్యాసమున 240, 241 పుటల తుదిమొదళ్ల అచ్చుపొరబాటులు: "కౌసల్యాదులు సహగమనముచేసిరి." "సత్యభామాదులు సహగమనముచేసిరి." అని అచ్చొత్తింపబడెను. కౌసల్యాదులు......చేసిరా?" "సత్యభామా......చేసిరా?" అని ప్రశ్నార్థకముగా దానిని సవరించి చదువుకొనదగును. గృ॥ సం.]

# పెండ్లిగొడవలు



★

చెల్లి వ్రాసిత వెందుకో పెంట్లి గొడవ చెప్పలేద నిజంబు ముం దొప్పగాను
పెండ్లి యన్నమాట బొమ్మల పెండ్లి కాదు శిరముతో మోయువలె నమ్మ బరువు లెన్నొ.
పొంది రెవ్వరు సుఖమును పెండ్లియాడి చెప్పవే చెల్లి నాతోడ సిగ్గు వీడి
యొందు కలరేని ఈయిల నెఱుక పరచు కనెద నొకసారి కన్నుల కఱవు తీర.

పెండ్లి పెండ్లని ముందుగా పోరుపెట్టి పెండ్లి యాడొక్క వత్సరం పోకమునుపె
పడుచు లెల్లరు మదిలోన బాధపడుచు వద్దు బాబోయి పెండ్లంచు మొత్తుకొంద్రు.

శతము లెన్నిది శోధించ శాస్త్రవేత్త పెండ్లియాడిన జంటలు పోగుచేసె;
కాని కనలేదు చివరకు కళ్లతోడ హాయిగా సుఖించిన జంట నమెరి కాన.

సిరిసంపదలు జూసి మురియుచు మదిలోన పెండ్లేమి జూడక చేయుటొకటి
వరునకు నచ్చని వధువునొక్క చోట పెద్దలందరు జేయు పెండ్లియొకటి

ప్రేమించి ప్రేమించి పెండ్లియాడెదనన్న పడుచునే చేయక విడుచుటొకటి
చదివిన కన్యకుఁ జదువు శూన్యంబైన వరునిచ్చి జేయు వివాహమొండు

యివియ కారణంబైయొప్ప యిలను నేడు నిలిచి యుండని సంసార్క నిజముగాను
కనుము చెల్లెలా యిప్పుడు కాలగతిని యొందు కటువంటి పెండ్లిళ్లు? యేమి! సుఖము?

కనుక వద్దు నేడు కంగారు మదిలోన; పెండ్లి గూర్చి గొడవ పెట్ట వద్దు
జరుగనియ్యి ముందు చదువంత పూర్తిగాఁ; జూడవచ్చు పెండ్లి వేడు కవల.

యిట్లు వ్రాసితి ననియెల్ల నింటిలోన అమ్మ నాన్నకు నెమ్మది కమ్మ చదివి
అక్క యింకను పెండిలి యాడ దంచు చెప్పి యొప్పించు బాగుగా జెల్లి నీవు.

మీరామ్

# లోకవార్తలు



నెల్లూరిలో ఒకడాక్టరు ఇంటిలో గతమాసమధ్యమంలో ఉన్నట్టుండి నిష్కారణంగా మంటలు లేవడం ప్రారంభించినవి. కారణమూహించలేకున్నారు.

♦ ♦ ♦

కృష్ణాజిల్లా దివితాలూకా వెలువూరుగ్రామం మీదికి ఏప్రిల్ 26-వ తేదిన అర్ధరాత్రప్పుడు 200 మంది సాయుధులు వచ్చిపడి వెండి, బంగారం నగలు, నగదు దోచుకొని వెళ్లారు. ప్రజలను చాలాహింసించారు. 3 గురు చచ్చినారు. కాంగ్రెసు సేవాదళ్ కమాండర్ బసవయ్య గ్రుడ్లుపెరకను యత్నించారు. ఈ బందిపోటు జట్టును కమ్యూనిష్టులు అనుకుంటున్నారు.

♦ ♦ ♦

బ్రిటిష్‌సామ్రాజ్య (?) దేశాలలోకల్లా ఈతలో ప్రవీణురాలైన మెట్టీఫేడ్ కన్య ఇండియాకు వచ్చియున్నది. ఆమె మద్రాసునకువచ్చి ఈ మే 15-వ తేదీన బీచిలోఉండే సరస్సులో తన ఈతనేర్పు ప్రదర్శింపబోతున్నది.

* ♦ ♦

న్యూయార్కు పట్నంలో మాకుషల్ దంపతులు నివసిస్తున్నారు. భర్తకు ఇప్పుడు 62 సం॥ లు. అతని వృత్తి కుట్టుపని. ఆదంపతుల కొకకుమారుడు. అతడు 10 సం॥ లనుంచీ తండ్రికి కన్పించలేదు. వాడు కెనడాకువెళ్లినాడని వానితల్లి వానితండ్రితో చెప్పినది. అయితే నిజమదికాదు. అప్పటికి వానికి 23 సం॥లు. వానిని సేవలో నిర్బంధముగా చేరమంటారని తల్లికి భయమువేసి కొడుకును దాచిపెట్టుదామనుకున్నది. ఒకరూములో దీపము, టేబిల్, రేడియోసెట్టు, ఎన్నో పుస్తకాలుంచి తనకుమారుణ్ణి ఆగదిలోపెట్టి తాళము వేసినది. వాడు పడుకోడానికొకచాప ఏర్పాటు చేసినది. ఆగదిద్వారం ఇటుకసున్నంబెట్టి మూయించేసినది. అది మిద్దెగది. పైన రంధ్రంలోనుంచీ ఆహారం, నీరు విడిచేది. ఆయువకుడు అట్లా-ఈ పది సం॥ లనుంచీ గడిపాడు. గుడ్డలు మార్చుకోలేదు; గడ్డంపెరిగింది. ఇటీవల ఆమె ఆసుపత్రికి వెళ్లిచేరవలసివచ్చి-తన ముఖ్యస్నేహితులతో "మా అబ్బాయిని కొంచంచూడండి" అని వారికీ రహస్యం చెప్పింది. వాళ్లు ఈసంగతి కాస్తా పోలీసులకు చెప్పినారు, పోలీసులు ఆపిల్లవాణ్ణి బయటపెట్టినారు. వానికి మతి స్థిరంకూడా లేదట.

♦ ♦ ♦

జెమినిస్టూడియో యజమాని, ఆనందవికటపత్రికాధిపతి శ్రీ యస్. యస్. వాసన్‌గారు గాంధీస్మారక నిధికి 1 లక్ష రూ॥ లిచ్చారు.

♦ ♦ ♦

జెకోస్లొవేకియాలో కలపతో విమానం తయారు చేశారు. ఇది మామూలుగా గం॥కు 132 మైళ్లు ప్రయాణం చేస్తుంది. ముగ్గురు కూచోవచ్చు, ఏక టాకీన 620 మైళ్లు నడుస్తుంది. 100 మైళ్లకు 4 గాలన్ల పెట్రోలు ఖర్చవుతుంది. ఆస్ట్రేలియాకువెళ్లి తిరిగి పోతూ బొంబాయిలో దిగినది.

♦ ♦ ♦

ఇంగ్లాండురాజు ఆరవజార్జి అల్లుని వేల్సునందలి బాంగర్ విశ్వవిద్యాలయాధ్యక్షునిగా నియమించారు.

ఆ విశ్వవిద్యాలయంవారు ఆయనభార్య - ఎలిజిబెత్ రాకుమారికి సంగీతశాస్త్రములో నిధియని డాక్టరేట్ బిరుదివ్వ తీర్మానించారు. రాజుఅల్లుడు విశ్వవిద్యాలయాధ్యక్షుడుగా జేసిన మొదటిపని తనభార్యకు 'సంగీతకళానిధి' అనే డిగ్రీ ఇవ్వడము. ఆమెతో అప్పుడు-వేల్సుభాషలో మాట్లాడాడు. అధ్యక్షుడు తనభార్యకు డిగ్రీనిచ్చి ఆచార ప్రకారం హస్తచాలనం చేసినప్పుడు ఆమె చిరునవ్వు నవ్విందని వేరే చెప్పవలెనా ?

♦ ♦ ♦

కాశీ సంస్థానంలో ఒక కుగ్రామమందు నిమ్నజాతిస్త్రీకి-6 రు కవలపిల్లలు కలిగారు. శిశువులు 45 నిమిషాలు జీవించి చనిపోయినారు. తల్లి చావుతప్పి బయటపడినది-నెమ్మదిగా ఆమెకు ఆరోగ్యము చేకూరుచున్నది.

♦ ♦ ♦

మద్రాసు ప్రభుత్వపు లెఖలనుబట్టి సుఖరోగాల వ్యాప్తిలో గుంటూరుజిల్లాది అగ్రతాంబూలము: దక్షిణ కన్నడమండలము కడపటిది.

♦ ♦ ♦

విద్యావిషయము, శిశుమన స్తత్వములగూర్చి పరిశోధనల గావించుటకై రు. 1,50,000 లను శ్రీమతి నిర్మలబేన్ ఆకుబాయిగారు గుజరాత్ విశ్వవిద్యాలయానికి విరాళమిచ్చినారు.

♦ ♦ ♦

ఈవాస్నదంపతులు ఇటీవల తమ 5 మాసముల శిశువును వెంటగొని భారతదేశమునుండి యూరప్ ఖండానికి విమానంలో వెళ్లారు; మార్గమధ్యంలో అమెరికాలోదిగి బంధువులను చూచారు. యూరపు నుండి తిరిగీ వారు ఇండియాకు వస్తారుట. ఇంతటి పసికూన ఇదివరకు విమానప్రయాణ మొనర్చి యుండలేదు.

♦ ♦ ♦

తిరుచిరాపల్లి సమీపము- ఒరయూరులో ఒక స్త్రీకి గతమాసాంతమున నాలుగుకాళ్లు, నాలుగు చేతులుగల మగశిశువుకల్గినాడట. దేహము సామా

న్యమే. పుట్టినప్పుడాబిడ్డతూకం 9 పౌనులుండినది. బిడ్డ మూడుగంటలుబ్రతికి చనిపోయినాడు.

◆ ◆ ◆

రైలులో ఒకనాసిక్ వాసి, ఒకదగాకోరు కలుసుకున్నారు. పరస్పరం పరిచయంకోరకు తమతమ పేర్లుగలకార్డులు మార్చుకున్నారు. నాసిక్ వాసి ధనవంతుడనీ ఇంకా ఇతరకుటుంబవివరాలు, దగాకోరు ప్రస్తావనలో తెలుసుకున్నాడు. నాసిక్ వాసి కోయంబత్తూరులో దిగాడు. దగాకోరు కాలికట్ వెళ్లి ఒక హోటలులో దిగాడు. నాసిక్ వాసిపేర. ఆతని తండ్రికి టెలిగ్రామిచ్చి టెలిగ్రాపు మనియార్డరుపై రు. 150 లు తెప్పించి తీసుకొని మాయమైనాడు. కేసు విచారణలోనున్నది.

◆ ◆ ◆

బ్రిటన్ లో ష్రాప్ షైరునందు పెద్దవాళ్లైన ఆడువారికి చదువుచెప్పేకాలేజీ ఉన్నది. అందులో ఈచదువు 3 రోజులు ఉపన్యాసలివ్వడం. ఇందుకు వెళ్లేయువతులు 5 సం|| లలోపు బిడ్డలను వెంటతీసుకెళ్లవచ్చు. వారు చదువుకుంటున్నంతకాలం ఆబిడ్డలను అక్కడినర్సరీస్కూళ్ల సూపర్ వైజర్ లంట్ కన్యకనిపెట్టి ఉంటుందిట. రాత్రిళ్లు వాళ్లాతల్లులుండే గదులలోనే నిద్రపోతారు.

◆ ◆ ◆

హవాయిదీవులలో పండ్ల పంటచాలాహెచ్చు. ఇతరదేశాలకున్నూ ఎగుమతి అవుతున్నవి. యుద్ధంరోజులలో అమెరికన్ సోల్జర్లతోపాటు ఒకవిధమైన పురుగు ఈదీవులకు దిగుమతి అయినది. అది పండ్ల చెట్లకుపట్టి పండ్లను నాశనముచేస్తున్నది. సాలినా. లక్షలకొలది డాలర్లు నష్టపరచినది. దీనికి వినాశనకరమైనది ఏమిటాఅని పరిశోధకులు తీవ్రంగా పనిచేశారు. ఈపురుగును తినేపురుగు మలయాదీవులలో దొరికినది. ఆపురుగులను వారానికి రెండు విమా

నాలలో 2,00,000 పురుగులుగా హవాయిలో దిగుమతి చేశారట.

◆ ◆ ◆

ఫాక్‌లాండు దీవులలో బ్రిటిష్‌వారు వలస చేరారు. అక్కడ స్టాన్లీ అని ఒకరేవుపట్నం. దానికి బయట రోడ్లేలేవు. ఆదీవులలో, ఉపాధ్యాయులు ఇంటింటికివెళ్లి చదువుచెప్తారు. ఒక్కొక్కప్పుడు వీరు గుర్రంమీదను, పడవమీదను ప్రయాణంచేస్తారు. ఒక్కొక్కగృహస్థు ఇంటికివచ్చి 15 రోజులు వరుసగాఉండి వారిపిల్లలకు చదువుచెప్పి పైఆఫీసరుకు వ్రాసి వెళ్తారట. ఆపిదప రేడియోద్వారా వారికి విద్య గరపబడుచుండును.

◆ ◆ ◆

గార్‌ఫీల్డు వెస్టన్ అనేఆయన పూర్వము బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు. ఆయన బడిపిల్లల ఆనందానికి, విద్యాసముపార్జనకు కొంతధనం దానంచేశారు. దీని వినియోగం చిత్రం. బ్రిటన్‌లో 14-17 సం॥ల మధ్య బడిపిల్లలను 50మందిని ఏరుతారు. వీరిని కెనడా దేశం తీసుకెళ్లుతారట. ఈప్రయాణంలో 3 వారాలు సముద్రయానం బిడ్డలు అనుభవిస్తారు. అక్కడ దేశంలో చూడదగిన వివిధ ప్రదేశాలున్నూ 3 వారాలు చూస్తారట. అంతట అక్కడ ఒక్క శిబిరమేర్పరచి - మూడువారాలు శిబిరశిక్షణకూడా ఇస్తారట. పిదప మళ్లీ ఇంటికి తీసుకొస్తారు.

◆ ◆ ◆

ఇటీవల హత్యానేరమునకై ఒక జర్మనీవాడిని మార్చి 11-వ తేదిని ఉరితీశారు. భార్యగర్భవతి. ప్రసవించేదాక నిదానించమని మొరపెట్టుకున్నా ఆపలేదు. ఈ ఏప్రిల్ 18 వ తేదిన వానిపెండ్లాము ముగ్గురు కవల బిడ్డలను కనినది.

◆ ◆ ◆

పాశ్చాత్యదేశాలలో బల్లలమీద పెట్టుకొని భోం చేస్తారు. పదార్థములు పళ్లెములలో వడ్డిస్తారు. ఇవి సామాన్యంగా పింగాణివి: మట్లాడితే పగిలిపోతుంటాయి. ఇప్పుడు కొత్తరకం పళ్లెములను ఇంగ్లాండులో తయారుచేశారు. పగలవు; వాటిలో వేడి పదార్థముంచినా వాసనా, కొత్తరుచి రావు. క్రింద పడగానే మిట్టిపడతాయట. కొంతమంది ఇల్లాండ్రున్నూ మిట్టిపడుతుంటారు! ఈ కొత్తసరుకును లండనులో ఈ మే 2-వ తేదిన ప్రారంభమయ్యే ప్రదర్శనంలో ప్రదర్శిస్తున్నారు.

# గులాబి

కోవిద విద్యాప్రవీణ, సీతారామమూర్తిగారు

తెరపగాలులు మంచిముత్తెములఁ జిమ్మ;
చిలుకలును, గోరువంకలు పలుకరించ;
పంచమ శ్రుతిఁ బికమాలపించి పాడ;
బర్హభారానఁ జూపరుల్ భ్రమసి పోవ;
నాట్య భంగిమఁజూపు నానాడు కేకి;
చేరి యనురాగమునను మల్లికలతోడ
మన్ననల నందె ప్రకృతి ప్రసన్న యగుచు.
మంద హాసితంబు విడిపూల చందమచట...

♦ ♦ ♦

దిద్ది తీర్చినరాగంబు ముద్దులొలుక
రేకు రేకున నునుతళుకు రేగి, మోద
కరము మాదకమున్నాగ కన్నుగవకు
మనసు దీరగవిడిపూచె మాగులాబి;
పూవు బిగి సొంపుతావుల ప్రోవుతావు
పూవులకు రాణిరేకుల పున్నబోణి.
తొళుకు నవ్వుల సింగార మొలుకు వెలికి.
కలత మొలతల కలలనుఁ గాంచదద్ది.

♦ ♦ ♦

ఇట్లె వికసించియుండు నంచెంచెనేమొ?
భావి యాపద నూహించు వారలెవరు?

♦ ♦ ♦

ఒక్కయువకుడు ఆపూవునోర జూచి
యోర్చుకొనలేక ముంగల యూహ లేక
పంద! తాత్కాలి కానందమంద నిట్టు
త్రెంచి కోటున తగిలించ నెంచెదాని ....
కఱకు చేతుల నడుమ దా నలిగిపోయి
ఒక్కత్రుటి నేమి తోచ[illegible]క్కపోయి
తనదుదుస్థితి గమనించె వనటఁ జెంది.
వాడి వమ్మగు నాపువ్వు పలికెనిట్లు.

♦ ♦ ♦

"ఇట్టి మూర్ఖుడవంచు నేనెఱుగనైతి
ఇద్దినాగరికత? యేటివిద్దెయొక్కొ?
నేటి నుండియు నాయాస నీటఁగలసె
వాడు రేకులతో ధూళిపాలె నేను.
జీవమునుఁ గష్టసుఖములు లేవునాకు
ననిఁ దలంచితివేమొ? నీ వడుగరాదొ!
పండితుల దీనిమ్మరంబు; వారెఱుంగు
నుబుసు పోవగనిటుఁ జేయ నొప్పునొక్కొ?
ఏడ్వగావలె నవ్వగనెట్టు లగును?
కనుల మూసితి నేమియున్ గాంచలేక
రేకు లన్నియు విడనైన లేక పోయె
వాడ మొదలిడెనీచేతఁ జూడుమయ్యొ!

♦ ♦ ♦

చిగురు కొమ్మలనడుమ నిశ్చింత నేను
పచ్చపచ్చని యాకులపజ్జ నుండ
నైజ సౌందర్య మాస్వాదనంబు చేయ
రాదొకో? ఇట్టిసరసత లేదా? నీకు.
చిన్నికరువలి నెత్తావిఁజిలుక; నన్ను
వేడుకనుఁ జూచిమోదమంద కూడదొక్కొ?
తివిరి యుబికిన పశువాంఛఁదీర్చు కొనఁగ
నాశ మొనరించితివి నాదు నాశలన్ని.

♦ ♦ ♦

చూడు మల్లదె నను త్రెంచఁ గాడ మెట్లు
మొండెమై యట్టె యేడ్చుచునుండె నిలచి

కొన్ని ఘడియలలో రేకులన్ని వాడి
ధూళి పాలయినేజూడు దొర్లుచుండు
చిత్రమై పూలనిండిన చిగురుకొమ్మ
లింక నన్నుఁజేర్చియాడుట బొంకుసుమ్ము.
కంఠమున వేడ్క మీరంగ కౌగలించు
ఆకు లన్నియుఁ గడుదూర మయ్యె నాకు.
చిట్టి చిలుకలు నన్ముద్దు పెట్టుకొనవు
అళులు కమ్మనితమపాట నాలపించి
చేరి వినిపింపవయ్యె! నేకోరి కోరి
చూచినను నాదుదెస కికఁ జూచు నెవరు?
తేటు గోటుల నాతోటి సాటిఁగల్గి
కలిసి యున్నాళ్లునాడిన చెలులుకూడ
నన్ను జూచిన భీతిలు చున్నయటులఁ
గానుపించవు నాకింక; కర్మమేమొ?
పరుల దుఃఖంబులనుఁ బోల్చువార లెవరు?
నిజ సుఖంబుల మత్తెక్కి సీల్గునొకడు,
కష్టవహ్నిని నొక్కండు కరగి మరగు
రుచులలోఁ బడి నరు లందఱునుఁ జరించు

♦ ♦ ♦

గొప్పవారని గర్వించికులుకుఁ జూపు
నట్టికాలమున జనియించి నట్టినీదు
చేతనొక్కత కన్నిటం జేటుగల్గె
(వలసె నాయాసలన్నియు వదలుకొనగ)
నీదు చేజేత నాకగు బాధనీకుఁ
గలుగఁ బరిహింసగుర్తించఁ గలవుకాదె!

అమ్మ తన మేనఁజొచ్చినయపుడె, తానుఁ
బరులపై వేయు శరముల బాధ నెఱుగు.

♦ ♦ ♦

ఆమహానంద సుందర మాయుషస్సు
నింకచూడగ లేను నేనెన్నడైన
మనసుదీరగ విడి మోద మగ్ననైతి
నయ్యె చెప్పుదు నేరితో? నందు నెవరి?
ఐనదైనది దీనికై యన దలంపఁ
గాని యొకమాట బోధింపక నె మనంబు
ఒప్పకుండుట నిదినీకుఁ జెప్పుచుంటి
నేను జీవంబులేక యేలేను; జడము
కాను; దుఃఖంబు బాధయుఁ గలుగునాకు
కాన నన్నుఁ ద్రుంప పాపంబు కలుగు నీకు
ఇట్టి యఘమునుమించిన దెద్ది కలదు?
"పరుల కగుదుఃఖ నివహంబుఁ బారఁద్రోల
హితము లోకంబునకుఁగూర్ప వెతలఁ దీర్పఁ
బూజసేయంగ దేవులఁ బుష్ప ములను,
పత్రములఁగోయు మద్దానఁ బాపమేమి?
ఊరికే ఇట్లుకోరకు ముబుసుపోవ
దోషమున్ గ్రూరమును ధర్మ దూష్యమిద్ది.
నలుసు నీకంటపడ బాధ కలుగ నీకుఁ
బరుల బాధింప నీరీతిఁ బాడియొక్కొ?
ఏలనాయడ మన సిట్టు లేలఁగల్గె?
ఎన్నొ పూవులు విడియిట నున్నవయ్యె!
ఏమి చెప్పుదు నెవరితో నెట్టులందు?
"గుణము రూపంబు ఒకనాడు కూర్చువెతల!"

# శ్రీమతి టి. కె. యశోదాదేవిగారు



శ్రీమతి యశోదాదేవిగారు ఆంధ్ర సంగీత ప్రపంచమునకు ఒక నూతనశోభ తెచ్చిన విదుషీమణి. మధురాతిమధురమైన త్యాగరాజ కీర్తనలకు ఈమె కంఠమాధుర్యము ఒకవన్నె తెచ్చుచున్నదనుట అతిశయోక్తి కానేరదు. ఆమె చిలకమర్రి లక్ష్మీనరసమ్మగారి ఆఱవసంతానము. తండ్రి కాకినాడ మెక్లారన్ హైస్కూలులో ప్రధానాధ్యాపకులు. ఈమె కాకినాడలో జన్మించినది. ఫోర్తుఫారంవరకు విద్యనభ్యసించి సంగీతముపైనున్న అభిరుచికొద్దీ ఆఱు సంవత్సరములనుండి శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారివద్ద సంగీతము సాధనచేసినది. ఇప్పుడు ఈమె చక్కని పాట కచ్చేరీలు చేయుచున్నదని తెల్పుటకు గర్వించుచున్నాము. ఈమెకు నలుగురు సోదరులు. పార్థసారథి, లక్ష్మణాచారి, నరసింహాచారి, రామచంద్రాచారిగార్లు. వీరందరూ ఉత్తమవిద్యనభ్యసించినవారే. ఇట్టి సంస్కారముగల కుటుంబములో పుట్టి సంగీతమునకు తనజీవితమును అంకితముచేసినది. గతమాసమున శ్రీరామనవమి యుత్సవమున ఆంధ్రవిజ్ఞానసమితియందు ఈమె కచ్చేరీచేసినది. అధ్యక్షత వహించిన శ్రీ రాజా బి. రామకృష్ణరాజుగారు ఈమె సంగీతకళావిశేషమును మెచ్చుకొని ఇంకను అధికతమ యశస్సు సంపాదించుగాక యని ఆశీర్వదించిరి.

(ప్రేక్షకుడు.)

---



'అక్కచెల్లి' స్వంతముస్తాబు.
మా చీరలుబాగున్నవి కదా ?

పంపినవారు :
సూర్యదేవర
శకుంతలాదేవి.



"నా పేరు జ్యోతి; నాకు మూడు ఏళ్లు,
'గాంధితాతను చంపారుకొట్టి ఎందుకు'?" అంటుంది.

# ఆదర్శవనిత

శ్రీమతి మాచిరాజు రత్నకుమారిగారు

"అమ్మాయీ, లలితా, ఇంతసేపేంచేస్తున్నావే? ఎవ్వరింట్లోనైనా ఇంతసేపుకూర్చున్నావా? వీళ్లింట్లో ఇంతసేపుకూర్చున్నావెందుకు? చూడు అప్పుడే 8 గంటలుఅయింది" అంది లలితతల్లి జానకమ్మ అప్పుడే వస్తూయున్న లలితతో.

లలిత;—పోనిద్దూ, ఎన్నిగంటలైతేనేమిగాని, సత్యవతిగారింట్లోనుంచి రాబుద్ధే వేసిందికాదే. వాళ్లిల్లు ఎంతబాగుందనుకున్నావు? ఆవిడచెప్పేసంగతులు వింటో, ఆ ఇంట్లో కూర్చుంటే ఎన్నిగంటలయిందో కూడ తెలియలేదు.

జానకమ్మ:-వాళ్లఇల్లు పెద్దబంగళా కాబోలు, అందుచేత అంతబాగుంది. చిన్నఇళ్లన్నీ ఎలా బాగుంటాయి. అందుకా ఇంత సేపుకూర్చుంట?

లలిత:—అదేనమ్మా నీ పొరబాటు. వాళ్లఇల్లు పెద్దదగుటవలన బాగుందనికాదు నావుద్దేశం. అసలు నిజంగా వాళ్లఇల్లు పెద్దదికానేకాదు. చాలచిన్నది. ఒక్కగది, ఒక చిన్నవంటిల్లు, ఒక చిన్న అరుగు. శుభ్రంగా వుండబట్టి చాలబాగుంది. నువ్వు "చిన్నఇళ్లన్నీ ఎలాబాగుంటాయి?" అన్నావు. నీలాగే అందరూ అనుకొంటారుకదా? అటువంటివాళ్లు సత్యవతిఇంటికివెళ్లి కాస్సేపు కూర్చునివస్తే. చిన్నఇల్లుకూడ ఎలాబాగుచేయవచ్చో తెలుస్తుంది.

జానకమ్మ:-ఇంతకీ ఎలావుందో చెప్పకూడదూ?

లలిత:—ఎలాగుందనిచెప్పను. ప్రొద్దున్నే దాసీది లేకపోవడంమూలాన్ని పాచివగైరాలు చేసుకొని, కాఫీతయారుచేసి, భర్తలేచేటప్పటికి తనకాలకృత్యాలుతీర్చుకొని, ఇల్లు శుభ్రంగాతుడిచి వుంచుతుందిట. ఇంతలోభర్త, చంటిపిల్ల లేస్తారు. భర్తకి కాఫీఇచ్చి, ప్రొద్దున్నే ఆఫీసుకు వెడతాడు గనుక పంపించి, చంటిపిల్లకి నీళ్లుపోసి, కానినిపాలుపట్టి, ముస్తాబుచేస్తుందిట. ఆ తరువాత పక్కలు శుభ్రంగాదులిపి ఎత్తేసి, మంచంగూడ ఒకప్రక్కనేపెట్టేస్తుంది. తాను సబ్బుపెట్టవలసినబట్టలకి సబ్బుపెట్టివుతికి, వట్టినే వుతకవలసినవి అలాగేవుతికి ఆరవేసి, చెంబులు, పళ్లెములు, బిందెలు తోముకొని వుంచుకుంటుంది. ఒక్కమాసినబట్టగాని, అసహ్యంగా ఇల్లంతాజిమ్మేసినబట్టలుగానిలేవుసుమీ! మాయగానే చాకలికివేసేస్తుంది. అసలు సాధారణంగా చంటిపిల్లవున్న ఇల్లుఅంటే నానా ఛండాలంగానువుంటుంది. బొంతలు, దుప్పట్లు నీచువాసనలేస్తూ డోకువస్తూయుంటాయి. కాని వాళ్ళఇల్లు చంటిపిల్లవున్న ఇల్లులాగే వుండదు.

జానకమ్మ:-భర్తకి పెద్దజీతమేమో? అందుచేత అంతశుభ్రంగావుంది.

లలిత:—జీతానికి శుభ్రానికి సంబంధంఏమిటమ్మా? ఆయనకి ఏదోకంపెనీలో పనిట; 30 రూ॥లుజీతంట. చూశావా? జీతంకూడ ఎంతతక్కువో? ఆ శుభ్రం ఆ విడలోయుందిగాని, జీతంలోలేదు. సరేకాని రు 100 ల జీతగానిభార్య సీతమ్మగారిల్లు ఎలాగుంది? వాళ్లఇంటికివెడితే ఒక్కనిమిషం కూడానిలవలేము. రామరామ; చంటిపిల్లలులేకపోయినా పెద్దవాళ్లేచిన్నపిల్లలకన్నా అసహ్యంగా తయారుచేస్తారు ఇంటిని. దుప్పట్లు, గలేబులు, చీరలు, జాకెట్లు, తువ్వాళ్లు, చొక్కాలు, లాగులు, ఒకటేమిటి అన్నీమాసి గొడ్డుతోళ్ళలాగుంటాయి. అన్నీఎక్కడపడితేఅక్కడ దొల్లుతో వుంటాయి. ఇల్లు నానాతుక్కుతోనునిండి ఎన్నాళ్ళయితుడిచారా అనిపిస్తుంది. ఇంక ఆ పెరడుంటుంది? నారాయణా! మనుష్యులు కాపరంవున్నట్లువుండదు. మోకాలిలోతు తుక్కుతోనిండి వుంటుంది. "తుడిపించుకోండి" అంటే ఎవ్వరికమ్మాశ్రద్ధ? అంటుంది సీతమ్మగారు. వాళ్ల

సామానుంటుంది. హరిహరీ! ఏజన్మాన్ని తోమేరో అన్నట్లు దుమ్ముతోటి, బూడిదతోటి నిండివుంటాయి. బిందెలు అంగుళందళసరి మన్నుతో గిలాబా చేయబడియుంటాయి. మొన్న ఆవకాయజాడీని చూసి నేను కుండఅనుకున్నా. అంతఅసహ్యంగావుంటుంది. ఇంక మనుష్యులు ఎంత అసహ్యంగావుంటారో చూశావా? అందుకే నాకు వాళ్ళఇంటికి వెళ్ళడమంటే తలనొప్పి. వెళ్ళినా ఒక్కనిమిషంకన్నా ఎక్కువసేపుకూర్చోను.

జానకమ్మ:-సరే! సత్యవతి సంగతిచెప్పు.

లలిత;—అప్పుడే అంతనచ్చిందా? సరే విను. సత్యవతికూడ చాలశుభ్రంగా వుంటుంది. కట్టుకొనేవి సాధారణమైనబట్టలైనా ఎంతో అందంగావుంటాయి. నీళ్లు చాలశుభ్రంగాకడిగిన బిందెలలో పోసి జాగ్రత్తగా మూతలుపెడుతుంది. మూతలవిషయం చాలాజాగ్రత్తగా వుండాలి. తరువాత మడిగట్టుకొని వంటచేసి, తక్షణమే పొయ్యిఅలికేస్తుంది. అందుచే వంటఅవగానే వెళ్ళినా వంట చేసినట్లుండదు. వంటచేసేటప్పుడుకూడ మిరపకాయిముచికలుగాని, వుల్లిపాయితొక్కలు-కూరతొక్కలుగాని, క్రిందపడ్డ పోపుసామానులుగాని వుంచక తక్షణమే ఎత్తిపారేస్తుంది. ఎక్కడ తీసినసామాను మళ్లీ జాగ్రత్తగా అక్కడే పెట్టేస్తుంది. బొగ్గులు, బూడిద, పుల్లలు ఏమీ లేకుండా ఎత్తేస్తుంది. తుక్కుఅంతా ఒకబుట్టలోవేసి బొగ్గులుఎండలోవేసి, మళ్లీ వంటిల్లు మొదలైనవి శుభ్రంగ తుడుస్తుందిట. ఆరినబట్టతీసి మేకుల్ని పెడుతుంది. చంటిపిల్లపడుకోని సమయములలో గోడకివున్న మేకుకి వుయ్యాలకట్టేస్తుంది. అందుచే దారికడ్డులేకండా, చిన్నఇల్లు అయినా విశాలంగా కనబడుతుంది. చంటిపిల్లకూడ చాలశుభ్రంగావుంటుంది. భర్త 11 గం॥లకి వస్తాడు. ఇద్దరూభోజనంచేసి కంచాలుకడిగేసి అంట్లు అవతలపడేసి ఇల్లుసర్దుకొనివస్తుంది. చంటి పిల్లకి మళ్లీపాలుపట్టి పడుకోపెడుతుంది. మధ్యాహ్నం అందరిలాగ అనవసరప్రసంగాలతో టైము నష్టపరచక ఏ కుట్టు కుట్టుకుంటోనో, రాట్నం తీసుకొంటోనో లేక అప్పడాలు, వడియాలు, చారుపొడి, వక్కపొడి, మొదలైనవి తయారుచేసుకొంటోనో, వీలైనప్పుడు యేసద్గ్రంథమో చదువుకొంటోనో కాలంగడుపుతుంది. వున్నకొంతపెరటిలోను సగం ప్రత్తిమొక్కలువేసింది. దానివల్లవచ్చే దూదితో ఏకులుచేసి, నూలుతీసి వాళ్ళకి కావలసినబట్టలు నేయించుకుంటారు. మిగిలిన సగం పెరటిలో కూరల మొక్కలు, పాదులు పెట్టింది. అందుచేత కూరలు సాధారణంగా కొనుక్కోనక్కరలేదు. సాయంత్రం మొక్కలకి నీళ్లుపోసి, వంట మొదలైనవి అయినతరువాత, ఇల్లు అవీ శుభ్రంగాతుడుచుకొని, భోజనము లైనతరువాత రాత్రులు, హిందీనేర్చుకుంటోంది. వాళ్ళకికావలసినబట్టలన్నీ ఆవిడే చేతిమిషను మీద కుడుతుంది. అందుచే ఏదీ మిషనువానికి ఇయ్యనక్కరలేదు. పైగా ఇప్పుడు నేతకూడా నేర్చుకుంటుందిట, చెప్పడం మర్చిపోయాను. నెలకొకమారు బూజుదులుపుతుంది. 3 నెలల కొకమారు వెల్లవేస్తుంది. వారంవారం ఫోటోలు, అన్నీదులిపి, మళ్లీ ఎక్కడివక్కడ పెడుతుంది. అందుచే దోమలు, ఈగలు మొదలైనవి ఏమీచేరవు. అందరూ ఆరోగ్యంగాయుంటారు. ఇవన్నీ చెపుతోయుంటే నాకు రావాలనేలేదు. అందరూ అలాగేచేస్తే సగం జబ్బులు తగ్గిపోతాయి కదా అనుకున్నా. ఏమమ్మా! ఈవిడ పద్ధతులు అందరూ అవలంబించతగ్గవికదూ?

జానకమ్మ;-అవునమ్మా, అవును. ఆవిడచెప్పినవి చాలాబాగున్నాయి. పెద్దయినతరువాత నీవుకూడఅలాగే నడుచుకో. ఆవిడ ఆదర్శవనితసుమీ! అప్పుడప్పుడువెళ్ళి ఇంకా సంగతులునేర్చుకో.

లలిత;—సరేనమ్మా!




ప్రస్తుతము మనదేశములో ఆహారసమస్య అధికముగనున్న విషయము అందరకును తెలిసినదే. మనలో చాలామందికి ఆహారము తీసుకొనుపద్ధతిని గమనింపక పోవుటవలన ఆహారపదార్థములు ఎక్కువగ ఖర్చుఅవుటయేగాక, అనారోగ్యముకూడ సంభవించుచున్నది. ఆంధ్రదేశములో సగటున మనిషికి పూటకు పావుశేరుబియ్యము పట్టును. కాని సరిగ తినినచో యింకను తక్కువయే సరిపోవును.

ఆహారము బాగుగ నమలక మ్రింగుట చాలా అనారోగ్యము. నోరుప్రథమ జీర్ణకోశము. నోటిలో ఆహారము కొలదిగ వేసుకొని బాగుగ నమలి లాలాజలముతో బాగుగకలసి ద్రవముగఏర్పడిన పిమ్మటే మ్రింగవలయును. ఈవిధముగ ఆహారము తీసుకొనినచో ప్రస్తుతము తినుచున్నపదార్థములో సగముమాత్రమే తినగలుగుదుము. అంతేగాక జీర్ణకోశమునకు పనితేలికయై సులభముగ జీర్ణమగును. దానివలన ఆరోగ్యముకూడ బాగుగనుండును. వైద్యులనాశ్రయింప వలసిన అగత్యముకూడా తగ్గిపోవును పదార్థము బాగుగ నమలక త్వరితముగ మ్రింగినచో పదార్థములు అధికముగ తినవలసివచ్చును. నోరు చేయవలసినపని జీర్ణకోశము చేయలేదు. త్వరితముగ మ్రింగిన పదార్థమునందలి సారమును జీర్ణకోశము గ్రహింపలేదు. అట్టిపదార్థమువలన జీర్ణకోశమునకు శ్రమ అధికమగును. దానివలన అజీర్ణము సంభవించును. అజీర్ణమే సర్వ వ్యాధులకుమూలము. అందువలన ఆహారము తీసుకొనుటలో ఎక్కువశ్రద్ధ చూపవలయును. ఆవిధముగ చేయుచో మనము యిప్పుడు తినగలుగుచున్న పదార్థములో సగము మాత్రమే తినగలుగుదుము. సగము తిననే సరిపోవునని కూడా చెప్పవచ్చును. ఆహారమును మిక్కుటముగ తినక సామాన్యముగ తినుటవలన ఆరోగ్యముగను, శరీరము తేలికగను చురుకుగను నుండును. భోజనము అనంతరము కొంతనీరు త్రాగవలయును

ఈనియమములు పాటించినచో ప్రస్తుతము మనదేశములో ఖర్చు అగుచున్న ఆహార పదార్థములఖర్చు సగము తగ్గును.

అందువలన మనదేశములో ఆహారసమస్య చాలవరకు తగ్గుటయేగాక ముఖ్యముగ ఆరోగ్యమును కూడ కాపాడుకొన వచ్చును.



# హితోపదేశము

శ్రీమతి కొమ్మనమంచి జోగులాంబగారు.

బాల్యమునయందు విద్యలఁ బడయువలయు
యౌవనంబున గార్హస్థ్య మందవలయు
వార్ధకంబున మోక్షసంప్రాప్తి కొఱకు
యత్న మొనరింపవలయు సత్యము కుమార!

తనవయసును, తనరాఁబడి,
తనయింటి రహస్యములును, తనయౌషధ సే
వనమును, తనయాలోచన,
తనమంచియు, చెడ్డ, చెప్పదగ దెవ్వరికిన్.

ధర ననభ్యస్తునకును విద్యయె విషంబు;
అరుగకున్నచో భోజనం బగును విషము;
పేదవానికి సభలో ప్రవేశమె విష
మగును; ముసలికి పడుచుభార్యయె విషంబు.

జనకుఁ డుపాధ్యాయుండును,
మనుజపతియు, కూఁతునొసఁగుమామయు, గాయ
త్రిని జెప్పినయాతండును,
అనుసేయేవురును పూజ్యులగుదురు గురులున్.

భోజనంబు, నిద్ర, భువిసౌఖ్యమును, భయం
బనెడి యివ్వి సమము మనకుఁ బసుల;
కరయ విద్యనేర్వ నధికుఁడై జనుఁడొప్పు;
చదువకున్న వింత జంతు వగును.

అన్ని సందియముల నణంచి పరోక్షార్థ
ములను స్పష్టముగను దెలియఁజేయు
నట్టిశాస్త్రపఠన మక్షంబు మనుజున
కద్ది లేకయున్న నంధ సముఁడు.

యౌవనఁబు, ధనము, నవివేకితన, మధి
కార, మొక్కటొకటె కలుగఁజేయు
నెట్టి మానవునకు నేని యనర్థంబు;
నన్నియున్నఁ జెప్పనలవి యగునె!

బుద్ధి చదువులేని పుత్త్రుఁడు గలిగిన
వానివలన నింతయైన ఫలము
కలుగునొక్కొ! గ్రుడ్డికన్నున్న ముఖవికా
రంబు దక్క నేఫలంబు గలుగు!

పుట్టకున్నవాఁడు, పుట్టియు మరణించు
నట్టికొడుకు మూర్ఖుకన్న మేలు;
మొదటివారు దుఃఖమును కొంత గలిగింత్రు
కడమవాఁడు తాపకరుఁడు సతము.

దానమున, శౌర్యమందున, తపమునందు,
అర్థసంపాదనమున, విద్యార్జనమున,
నెవని హృదయంబు ప్రథితమైయొసఁగకుండు
బిడ్డఁడావాఁడు! తల్లికి పిలుపు చేటు.-

స్వీయ నీతి రత్నావళినుండి

# కళాకేంద్రంవారి నాటకప్రదర్శనాలు

  

గతసంచికలో రెంటిని ప్రస్తావించాను. పిదప మరి అయిదునాటకాలాడారు.

వీనిలో మొదటిది పరితాపం. ఈ నాటకాన్ని 'Ideal Husband' 'Lady windermore's fan మొదలైన ఆంగ్లనాటకాలలో హంశాలేరి అతికించినట్లుగాతోచింది. అందుచేతనే మనసంఘానికి అతికీ అతకనట్లున్నది. నటులుమాత్రం బాగానే నటించారనవచ్చు. కథనంతానడిపిన సూత్రధారి చాకచక్యంగల వాడే. ఆయన 'బాలన్స్' అనే ఊతపదమున్నూ అందమిచ్చింది.. దీనికిముందుగావేసిన తారాబలమున్నూ చమత్కారంగానేఉన్నది. అయితే ఆపెండ్లికొడుకు అంతపైస్థాయిలో గాకుండా కొంచము క్రిందిస్థాయిలో నడిచిఉన్నట్లైతే - ప్రబోధకరంగాఉంటుంది. క్రొత్తపెండ్లికొడుక్కువుండవలసిన అమాయకత్వము, తుండుడుకు బాగానేఉన్నాయిగాని-ఏకాంతంగా, కాగలపెండ్లాన్ని ప్రశ్నించేటప్పుడు అంతగాగద్దించడం, సహజమూగాదు; సబబూగాదు. దీనిని గుడివాడవారు ప్రదర్శించారు. ఈ నాటికధ్యక్షులు శ్రీ గోపాల రెడ్డిగారు.

ఆ మర్నాడు "విశ్వంపెళ్లి" బాపట్లవారాడారు. బాపట్లఅంటే దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రంగారాయుడై (బొబ్బిలి) నటించిన రంగస్థలము. ఆ రంగస్థలంలోనే సుప్రసిద్ధ స్త్రీవేషధారి కోపెల్ల హనుమంతరావుగారు నటించి కీర్తిగాంచినది. ఆ అంశావతారమై మెలిచినమెలకేఅంటూరు స్థానంవారిని. అట్టి బాపట్లనుండివచ్చిన-నటులు-అద్భుతంగానటించారు ఈనాటకాన్ని. ఈనాటకం-బెర్నార్డు షాగారి man and superman అనే నాటాకాన్ని అనుసరించి వ్రాసినట్లున్నదని - అధ్యక్షతవహించిన శొంఠి రామమూర్తిగారన్నారు; అయినా మనసంఘాని కతికినట్లేఉన్నదన్నారు. కాని పాశ్చాత్యవిద్యావేత్తలై నగరాలలో ఏర్పడిన ఒకకృత్రిమవర్గంలో ఇది బోధపడవలెగాని సామాన్యజనానికి బోధగాదు. అయితే వారి మనఃఫలకాల్లో కొన్నికొన్నిబీజాలు నాటగలదు. వాటిఫలితం? కాని మధ్య తరగతి విద్యావంతులకు ఆహ్లాదమొనగూర్చునాటకము. ఇందులో విశ్వంపాత్ర బహురమ్యంగాతీర్చబడినది. అందుకుతగినట్లు నటించాడు వేషధారి. ఆ పాత్రభావాల కనుగుణ్యంగా ఆతడు కంఠస్వరమమర్చాడు. అది ఉచ్చస్వరంగాదు; హీనస్వరంగాదు. గంభీరము; శుష్కము; కాని కరుణారహితంగాదు. హావభావములు సహజము. ప్రేక్షకుడుసహృదయుడైతే - ఊహించుకోని రసాస్వాదనమొనర్పుమని ఊరకమాటలందిస్తాడు.

ఆ తరువాత రోజున వరూధినీనాటకము. పూర్వనాటకములను మరచిపోతామేమోనని ఈ నాటక మాడించినారనిపించినది. మనుచరిత్రలోనిపద్యాలు సంగీతంరానివాళ్లుసమేతూ అర్థగాంభీర్యంతో చదువవీలైనవి. అలాంటివాటిని వారు పాడుతుంటే-'ఆసంగతే వచనంలోచెపితే బాగుండు' ననిపించినది. గంధర్వరాజ భటులహాస్యం ఈ కాలానుగుణ్యమైనదిగాదు. ఏలూరినాటకకంపెనీవారు శ్రమపడ్డారుగాని రసహృదయులను రంజింపచేయలేకపోయినారు. నాటికధ్యక్షత వహించవలసిన సాంబమూర్తిగారు రాలేదు. శ్రీ జస్టిస్ రాజమన్నారుగారు వారిస్థానే అధ్యక్షులైనారు.

పిదప 'ఇదాప్రపంచం' అనేనాటకాన్ని నెల్లూరినటులాడారు. ఇది ఖక్కరైతుల, మోతుబరుల మధ్య గొడవ. నెల్లూరినటులు దీనిని బాగానే ప్రదర్శించారు. రామిప్రేమాలాపాలు పాత్రోచితంగాఉంటే ఇంకా అందమిచ్చేవి. ఈ నాటకంలో పద్యాలులేకుంటే బాగుండేడిది. రవణయ్యకొడుకు అల్లా టప్పాపాటలు పాడడం న్యాయంగాని - కధనడిపేపాటలు అర్థరహితము; అసహజం, ఈ నాటకాని కధ్యక్షతవహించిన

కార్పొరేషన్ కమిషనరుగారు నాటకవస్తువునంగీకరించము అని ఖండితంగా చెప్పారు. వారిద్దర్యానికభివందనాలు. వారి ఆక్షేపణ సాంఘిక రాజకీయములుగా కన్పించవచ్చును గాని నిజానికి అది కళకు సంబధించిన గొప్పసమస్య. "నేను గొప్పయింటి రైతుబిడ్డను. మావంటి వారందరమూ బక్క రైతుల నిట్లు వేధించము. వేయింటికి ఎవ్వడో ఒక్కచవట చేసేది సామాన్య సంభవంగా నాటకవస్తువు చేయడం నేనంగీకరించను" అన్నారు నరసింహంగారు. అంటే, కళాసృష్టికి వస్తుసామగ్రి సమాజంలో సామాన్య సంభవములా, సకృత్సంభవములా? అన్న ప్రశ్న.

ఇది సుదీర్ఘంగా చర్చింపవలసిన సమస్య. మరిన్నీ ఈ యుదంతం కళాకేంద్రానికి విజయధ్వజం. ఇదే రాజకీయసభ అయితే,—'కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యానికి-జై' వాదులు—నరసింహంగారిని నోరెత్తనిచ్చేవారు కారు. కళాకేంద్రంలో కళాదృష్టిలో—ఎంతసరసంగా ఒక సాంఘిక సమస్య రూపించడానికి అవకాశమేర్పడ్డదో చూడండి.

కడపటి నాటకం—చంద్రగుప్త. శ్రీ స్థానంవారు కూడా విగ్గుకట్టినారు. క్రాపింగ్ గొరిగించుకొని పిలకపెట్టుకోగలిగిన సాహసి ఎవ్వరైనా చాణక్యుడు వేస్తే చూడవలెనని నాకు చాలా రోజులనుంచి అభిలాష. చాణక్యునివంటి రాజనీతిజ్ఞుడు ఎప్పుడూ కస్సుబుస్సుమంటుంటాడా? కర్ణకఠోరమైనమాటైనా, హృదయ విదారకమైనవారైనా—చల్లగా, తాపీగా మంచినీళ్ల మర్యాదగా చెప్పి-ఎదుటివానిని నిప్పులలో పొరటవలసిన చాణుక్యుడు తానే అస్తమానం — నిప్పుత్రొక్కి నక్కోతివలె చిందులుత్రొక్కుచుండునా? చంద్రకేతుడు పాడడానికి, అదీ జ్ఞాపకంరాని పద్యాలు కూడా, ఏల ప్రయత్నించవలెను? స్థానంవారిని ఎన్నిక పెట్టరాదు; కాని అది ఏమి వేసము? బౌద్ధసాంప్రదాయమని ఎవరో ప్రేక్షకులన్నారు. నాటి బౌద్ధుల శిరోజసంస్కార మట్టిదనడానికి ప్రామాణ్యము? పసలవారు అన్నంతకాకున్న కొంతసరుకు చూపినారు. అదియు తనకు తృప్తికాదనడంలో వినయమున్నది.

నాటకాంతంలో గతించిన అధ్యక్షత ముదరాబొందిన సాంబమూర్తిగారున్నూ, కళాకేంద్రం అధ్యక్షులు శ్రీ పిఠాపురం మహారాజావారున్నూ రంగస్థలాన ఉత్తమాసీనులై ఉపన్యసించారు. ఆ సమయంలో వారికి ఛాయ వేషధారిణి చేత వింజామర వేయించడం సరసంగాలేదు. "స్త్రీయైన దుర్గాబాయమ్మగారికి ప్రోత్సాహమిచ్చి మహిళాసభ నేర్పాటుచేయించారు సాంబమూర్తిగారు; స్త్రీవేషధారినైన నన్ను కటాక్షించి కళాకేంద్రాన్ని ఉద్ధరించాలి" అని స్థానంవారు సరసంగా ఉపన్యసించారు. ఉభయులూ కళాకేంద్రం అభివృద్ధి నాశీర్వదించారు.

మొత్తానికి ఈ నాటకాలవల్ల కొన్ని సంగతులు రూఢిపడ్డాయి. కంట్రాక్టు నాటకాలకంటె అమెచ్యూర్సు నాటకాలు అందమిస్తాయి. పురాతనపుకథావస్తువులకంటే నూతనకథావస్తువులతో నాటకాలు వ్రాసి ఆడితే ఎక్కువ సరసంగా ఉంటుంది. కాని సాంఘిక నాటకాలు వ్రాయడం ఆడడం కష్టతరము. విదేశ నాగరికతవల్ల సంఘంలో ఏర్పడ్డ అరలు కేటాయింపుగా ఉన్నాయి. ఈ అరలు క్రమంగా సమీపమైతేనేగాని అందరికీ తగిన నాటకాలు వ్రాసి ఆడడం సాధ్యంగాదు. ఇత్యాదిగా నెన్నిటినో ఈ నాటకాలు రసహృదయముల యోచనల రేకెత్తించుచున్నవి.

వీరిట్లాగే అప్పటప్పటికి ఇలాంటి నాటకాలు వేయించడం మంచిది. నాటకరంగస్థలంలో వేషధారణ ప్రధానాంశంగదా. అందు కడు నేర్పరులైన చంద్రశేఖరంగారి సహాయ మీకళాకేంద్రం తీసుకోవడం అవసరమని భావిస్తాను. వారితర్ఫీదులో నటులు, వయోరూపకంఠస్వరాలు గుర్తింపరానట్లు మార్చుకోగల నేర్పు కళాకేంద్రంలో నేర్చే అవకాశం ఏర్పడడం కళాకేంద్రం ఆదర్శసిద్ధికి దోహదమవుతుందని నా అభిప్రాయం.

(క. ఖ.)



# అమెరికాలో చట్టాలు — నేరాలు

అమెరికాలో నిషేధపు చట్టాలకు మితిలేదు. ఏ రాష్ట్రానికారాష్ట్రం చట్టాలు చేసుకోవచ్చు.

మిన్నెసోటారాష్ట్రంలో — స్త్రీలు, పురుషులు ధరించే పెద్ద ఉడుపులలోపున వంటినంటి ధరించే చెడ్డీలు వగైరాలు — ఒకే దణ్ణంమీద వేయరాదు.

గారీ, ఇండియానా — అనే రాష్ట్రాలలో వెల్లుల్లిపాయ తిన్నతర్వాత నాలుగు గంటలలోపున ట్రాములలో ఎవ్వరూ ప్రయాణం చేయరాదు.

మాస్, ఉతాహ్ రాష్ట్రాలలో — పగటి వెల్తురు వారిమధ్య కన్పించజాలనిచో, స్త్రీ పురుషులిద్దరుచేరి — నృత్యం చేయరాదు.

ఇండియానాలో — రోల్లర్ స్కేట్ (Roller Skate) అనేది నేర్పుతూ,— యువతీమణి మనస్సును హరించడం నేరము.

కన్నెటక్కీ రాష్ట్రంలో — ఏ స్త్రీయయినా చేతిలో దుడ్డుకర్ర (club) లేనిదే — ఈత సౌకర్యానికి ప్రత్యేకంగా ఏర్పడ్డ స్పష్టమైన ఉడుపులలో కన్పించరాదు.

కాలిఫోర్నియాలో — వేట లైసెన్సు లేనిదే, ఎలుకలకు బోనుపెట్టడం శిక్షార్హమగు నేరము.

జోలియట్, ఇల్లినోయిస్ రాష్ట్రాలలో — ఏ స్త్రీ అయినా — ఒక్క షాపులో ఆరు ఉడుపులకన్నా హెచ్చుగా సరిచూచుకొన్నట్లైతే జైలులో పెడతారు. (అంటే ఆ దేశంలో కుట్టిన ఉడుపులూ అమ్ముతారు కాబట్టి — కొనేవాళ్లు సరిచూచుకోవచ్చు అన్నమాట.)

సాల్ట్ స్టే మేరీ రాష్ట్రంలోను, మిచిగాన్ రాష్ట్రంలోను, గాలి కెదురుగా ఉమ్మివేయడం తప్పు. (దీని స్వారస్యం రైలులో కిటికీనుండి తొంగిచూచే వారికి తెలుసు.)

ఫోర్టుమేడిసన్, ఐఓవా రాష్ట్రాలలో — నిప్పుఆర్పే శాఖలో నౌకర్లు నిప్పు ఆర్పను వెళ్లేముందు 15 నిముషాలు ప్రాక్టీసుచేసి మరీ వెళ్లాలి.

న్యూహాంప్ షైరులో రెండు మోటారుకార్లు ఒక సందులో ఎదురొన్నప్పుడు రెండున్నూ పూర్తిగా ఆగిపోవాలి; ఒకటి పూర్తిగాదాటి పొయ్యేంత వరకు రెండవది కదలరాదు.

ఈ విధంగా నఖశిఖ పర్యంతమూ బంధించే చట్టాలుండడం చేతనే అమెరికాలో చట్టమంటే మర్యాదేలేదు. ఇట్టి చట్టాలు బహిరంగంగానే పాటింపబడడంలేదు.

సంపూర్ణమద్య నిషేధపు చట్టమే — మొట్టమొదట — చట్టమంటే నిర్లక్ష్యాన్ని ప్రజలలో మప్పినది.

ఆ విధంగా చట్టమంటే నిర్లక్ష్యం కాబట్టే అక్కడి నేరాలున్నూ విశేషం.

1945 లో ఈ క్రింది నేరాల జాబితా వింటే హడలు పుటుతుంది. హత్యలు—11234, స్త్రీలను బలవంత పరచడం 11537 , ప్రాణభయంపెట్టి దొంగలించడం — 58807 ; కన్నాలు వేయడం — 54279 ; మోటారుకార్లు దొంగిలించడం (మనదేశంలో సైకిళ్లు దొంగిలించినట్లు) 2,41,491 ; ఇతర నేరాలు 865531 ; — మొత్తం — 15 65,541 నేరాలు; అంటే ప్రతి 90 మంది జనానికి ఒక్క నేరం. ప్రతి ఆరునిముషాలకు ఎక్కడనో ఒకచోట ఒకడిని కొట్టడమో, గాయపరచడమో, ఏ స్త్రీనైనా చెరచడమో జరుగుతుంటుంది. ప్రతి రెండునిమిషాలకు ఒకకారు దొంగతనం జరుగుతుంది. ప్రతి 'రాత్రి' — ప్రతి నిమిషమున్నూ అమెరికాలో ఎక్కడో ఒకక్కడ — కన్నపు దొంగతనం జరుగుతున్నదన్నమాటే.

ఇవన్నీ రిపోర్టైనవి, పట్టుబడి శిక్షింపబడ్డవీ అయిన నేరాలు—కాని పెన్నో?

(రెనీయల్విక్ వ్యాసంనుండి.)

# స్త్రీ హృదయం

శ్రీమతి బొప్పన హేమలతగారు

దేవి పదునారేండ్ల బాలిక. ఈశ్వర్‌తో కలసి ఒకే పాఠశాలయందు చదివింది. పవిత్రమైన సోదరీ ప్రేమతో ప్రేమించింది తన విశాల హృదయంతో. కాని ఈశ్వర్ తనను పతిగా స్వీకరించమని ప్రార్థించాడు. వారం రోజులు గడువు పెట్టాడు, తనను పతిగా ప్రేమించి తెలియజెప్పమని.

దేవి మేనత్త తనకు జబ్బుగా నున్నదని దేవిని చూడవలయునని టెలిగ్రామ్ ఇచ్చింది అన్నగారికి. వెంటనే ప్రయాణమై వెళ్ళింది మన చిన్నారిదేవి. ఈశ్వర్ వారం రోజులు పూర్తికాగానే వచ్చాడు ప్రేమభిక్షకొరకు. ఎవరిని అర్థిస్తాడు? దేవి అక్కడ ఉంటేగా. నెల దాటింది. ఈశ్వర్ పెండ్లి అయింది. కాలచక్రంలో మరోరెండు నెలలు దాటిపోయినవి దేవి స్వగ్రామం వచ్చింది. ఈశ్వర్ వివాహమైనట్లుగా తెలుసుకొన్నది. తన సోదరునికి పెండ్లి అయినదికదా అని సంబరపడింది. దేవిని కలసుకొని ఈశ్వర్ "నీవు పెండ్లి చేసుకొన్నావంటే ఖూన్ చేస్తాను, నాతో ఉండు" అని బెదరించాడు. ఒక ఛిరునవ్వే అతనికి సమాధానం.

* * *

మరుసంవత్సరములో దేవిపెండ్లి అతిఘనంగా జరిగింది. ఈశ్వర్ దేవిని జామ తోటలో కలుసుకొని మరోమారు హెచ్చరించాడు. "నాస్వామికి నేద్రోహం చెయ్యజాలను హిందూ సతీత్వానికి కళంకము తీసుకొనిరాలేను, నా ధర్మం నేను నిర్వర్తించుకొంటాను, సోదరునిగా జీవితాంతమువరకు ప్రేమిస్తానన్నది భారతనారిదేవి." ఇంతలో "దేవి!" అన్న పిలుపు.

* * *

అత్తవారింటికి వెళ్ళింది మూడోరోజునే. దేవిని కలసుకొని హెచ్చరించాడు. కత్తిని చూపి నా ప్రతిజ్ఞ నేను నెరవేర్చుకొంటానని హృదయానికి గురిచూచి రెండుపోట్లు పొడిచేడు. తృప్తితో పరారయ్యాడు. దైవవశాత్తు ఆ కత్తిపోట్లు ప్రక్కకు దూసుకు పోయినవి. హాస్పిటల్‌కు చేర్చారు దేవిని. డాక్టరు "నాశక్తికొలది మీ బిడ్డను బ్రతికింప ప్రయత్నిస్తా"నని ధైర్యం చెప్పాడు దేవి తలిదండ్రులకు. ముందు స్టేటుమెంటుకావాలి ఎవరమ్మా నిన్ను ఖూనీచేయ పూనినది అని అడిగారు. దేవి ఆలోచించింది. "ఈశ్వర్ అని చెప్తితే అతనికి శిక్ష ఏమిటో అర్థంచేసుకొన్నది. తను చనిపోతూ ఒక స్త్రీ సౌభాగ్యాన్ని తుడిచివెయ్యటం ఎందుకనుకొన్నది. ఆ స్త్రీ ఎంత క్షోభిస్తుందో గుర్తించింది. చెప్పటానికి హృదయం అంగీకరించలేదు. అతనెవరో నేగుర్తించలేను. నాశీలం చెరప చూచాడు. నేను సహాయంకొరకు కేకవెయ్యబోయానుకాని, అతను కత్తినెత్తాడు.

తరువాత సంగతి మీకు తెలుసుకదా'' అని చెప్పింది దేవి. దైవవశాత్తు దేవి మరల ప్రజల్లో పడింది. ఈశ్వర్ దేవి జీవించి ఉన్నదని, ఆమె అంత్య సమయంలో ఉన్నప్పటికీ తనను రక్షించినదని తెలుసుకొన్నాడు. అవమానంతో కృంగిపొయ్యాడు. పరితాపంతో దద్దరిల్లాడు. వెళ్ళి క్షమించమని ప్రార్థిస్తే క్షమించదనుకొన్నాడు. క్షమించ ప్రార్థిస్తేనే తనకు హృదయశాంతి అనుకొన్నాడు. వెళ్ళి క్షమాభిక్షను అర్థించాడు. దేవి వెనుకటి వాత్సల్యంతోనే ఆదరించింది. ''దేవీ! స్త్రీ హృదయం ఎంత పవిత్రమైనది! నీ హృదయ పవిత్రతను తెలుసుకోలేని మూర్ఖుడనయ్యాను. దేవీ నిజంగా దేవివే. నన్ను నా హృదయాన్ని కాపాడిన భారతనారివి'' అని కన్నీళ్లు నింపాడు ఈశ్వర్.




శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ మాస్కోలో రాయబారిగా నున్నప్పుడు ఆమెకు వంటచేసిపెట్టిన "బుద్ధి" అనే వంటమనిషి రష్యానుగూర్చి తన అనుభవాల నిట్లా చెప్పినాడు:—

రష్యాలో ప్రజల్ని వారివారి వృత్తుల్నిబట్టి కాకుండా, అందర్ని మానవులుగా భావించి, సమానంగా గౌరవించేవారు. నేను వంటపని చేస్తున్నా గౌరవమైన పదవిలో వున్నట్లుగా భావించారు.

మందులు, పుస్తకాలు చవకగా దొరికేవి. రష్యాలోవున్న ప్రతివ్యక్తికీ, వైద్యం, విద్యా తేలికగా లభిస్తాయి.

నేను మాస్కో వెళ్ళాను. చాలా తీవ్రంగావుంది ఎండ. కొద్ది వారాల్లోనే చలి అధికమైంది. మాస్కో నా కంతో బాగుంది. లండను నచ్చలేదు. రష్యన్లు మర్యాదగల వ్యక్తులు. చాలా పనులు స్త్రీలే నిర్వహిస్తారు. స్త్రీలు పెద్దపెద్ద వుద్యోగాల్లోనూ వున్నారు. కూలీలలోనూ వున్నారు. సోవియట్ పౌరులలో పెద్దలకు చిన్నలకు భేదం ఎక్కువగాలేదు.

అన్ని వ్యాపారాలు ప్రభుత్వం చేతిలో వుంటాయి. షాపులన్నీ ప్రభుత్వానివే! ఏదైనా వస్తువు కావలసివస్తే 'క్యూ'లో నిలబడతారు. అక్కడ తోసుకోవడం, కుమ్ముకోవడం లేనేలేదు. ప్రతివ్యక్తీ శాంతంగా, సంతోషంగా నిలబడి వుంటాడు తనకు వరుసప్రకారం అవకాశం వచ్చేదాకా!

లండనులో స్త్రీలకంటే, రష్యాలో స్త్రీలు అందంగా వుంటారు. రష్యన్ పడుచులు, విదేశస్థులతో కలిసిమెలసి వుండటమనేది పెద్దలు ఒప్పరు. వీరిలో మంచి ఆరోగ్యం, శుభ్రతా వున్నాయి. ఏ పనినీ వారు తేలికగా చూడరు. దానిలోనే "గౌరవం" వున్నదని భావిస్తారు.

కొద్ది నెలలు మాస్కోలోవున్న తరువాత ఇండియాలో వుండటం కష్టంగావుంది.—(కృ॥ ప.)

శైశవ మనస్తత్వ శాస్త్రమును గమనించి శిశుబోధ గావింపవలయునవి నూతన బాలబోధనా విధానమును ప్రపంచమున ప్రచారమొనర్చి ఆచరింపజేయుచున్న శ్రీమతి డా. మరియా మాంటిసరి భారతదేశమందలి శిశువులనుగూర్చి, వారి విద్యా విధానమునుగూర్చి ఇట్లు నుడివినది:—

భారతీయ శిశువునకు పాశ్చాత్య శిశువునకన్నా ఏకాగ్రచిత్తముతో నుండగలశక్తి హెచ్చు. అయితే భారతీయోపాధ్యాయినికి సుఖజీవనానికి తగిన వేతనమివ్వరు. ప్రభుత్వం జోక్యం కల్గించుకొని, తాము మరచిన తమ పౌరులైన శిశువుల యోగక్షేమముల నరసినట్లైతే - భారతదేశానికి మంచి రోజులు ముందు న్నాయి. భారతీయోపాధ్యాయినులు - ఇంగ్లాండు హాలండు దేశాలలో మాంటిసరీ విద్యాలయాలు దర్శించాలి. విద్యార్థుల, ఉపాధ్యాయినుల మనస్తత్వములలో భారతదేశానికి, హాలండుకు భేదములున్నాయి. అయితే మాంటిసరీ విద్యాలయం నడపడంలో ఒక పద్ధతి యున్నది. అది నేర్చుకొని భారతీయాధ్యాపకులు, భారతీయ పరిస్థితుల కనుగుణ్యముగ నా పద్ధతినిమార్చి అవలంబింపవచ్చు. యూరప్‌లో ఒక నారీమణి అధ్యాపకురాలైతే ఆమె ఆ మరణాంతము అలాగే అధ్యాపకురాలుగానే




శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ మాస్కోలో రాయబారిగా నున్నప్పుడు ఆమెకు వంటచేసిపెట్టిన "బుద్ధి" అనే వంటమనిషి రష్యానుగూర్చి తన అనుభవాల నిట్లా చెప్పినాడు:—

రష్యాలో ప్రజల్ని వారివారి వృత్తుల్నిబట్టి కాకుండా, అందర్ని మానవులుగా భావించి, సమానంగా గౌరవించేవారు. నేను వంటపని చేస్తున్నా గౌరవమైన పదవిలో వున్నట్లుగా భావించారు.

మందులు, పుస్తకాలు చవకగా దొరికేవి. రష్యాలోవున్న ప్రతివ్యక్తికీ, వైద్యం, విద్యా తేలికగా లభిస్తాయి.

నేను మాస్కో వెళ్ళాను. చాలా తీవ్రంగావుంది ఎండ. కొద్ది వారాల్లోనే చలి అధికమైంది. మాస్కో నా కంతో బాగుంది. లండను నచ్చలేదు. రష్యన్లు మర్యాదగల వ్యక్తులు. చాలా పనులు స్త్రీలే నిర్వహిస్తారు. స్త్రీలు పెద్దపెద్ద వుద్యోగాల్లోనూ వున్నారు. కూలీలలోనూ వున్నారు. సోవియట్ పౌరులలో పెద్దలకు చిన్నలకు భేదం ఎక్కువగాలేదు.

అన్ని వ్యాపారాలు ప్రభుత్వం చేతిలో వుంటాయి. షాపులన్నీ ప్రభుత్వానివే! ఏదైనా వస్తువు కావలసివస్తే 'క్యూ'లో నిలబడతారు. అక్కడ తోసుకోవడం, కుమ్ముకోవడం లేనేలేదు. ప్రతివ్యక్తీ శాంతంగా, సంతోషంగా నిలబడి వుంటాడు తనకు వరుసప్రకారం అవకాశం వచ్చేదాకా!

లండనులో స్త్రీలకంటే, రష్యాలో స్త్రీలు అందంగా వుంటారు. రష్యన్ పడుచులు, విదేశస్థులతో కలిసిమెలసి వుండటమనేది పెద్దలు ఒప్పరు. వీరిలో మంచి ఆరోగ్యం, శుభ్రతా వున్నాయి. ఏ పనినీ వారు తేలికగా చూడరు. దానిలోనే "గౌరవం" వున్నదని భావిస్తారు.

కొద్ది నెలలు మాస్కోలోవున్న తరువాత ఇండియాలో వుండటం కష్టంగావుంది.—(కృ॥ ప.)

శైశవ మనస్తత్వ శాస్త్రమును గమనించి శిశుబోధ గావింపవలయునని నూతన బాలబోధనా విధానమును ప్రపంచమున ప్రచారమొనర్చి ఆచరింపజేయుచున్న శ్రీమతి డా. మరియామాంటిసరి భారతదేశమందలి శిశువులనుగూర్చి, వారి విద్యా విధానమునుగూర్చి ఇట్లు నుడివినది:—

భారతీయ శిశువునకు పాశ్చాత్య శిశువునకన్నా ఏకాగ్రచిత్తములో నుండగలశక్తి హెచ్చు. అయితే భారతీయోపాధ్యాయినికి సుఖజీవనానికి తగిన వేతనమివ్వరు. ప్రభుత్వం జోక్యం కల్గించుకొని, తాము మరచిన తమ పౌరులైన శిశువుల యోగక్షేమముల నరసినట్లైతే - భారతదేశానికి మంచి రోజులు ముందున్నాయి. భారతీయోపాధ్యాయినులు - ఇంగ్లాండు హాలండు దేశాలలో మాంటిసరీ విద్యాలయాలు దర్శించాలి. విద్యార్థుల, ఉపాధ్యాయినుల మనస్తత్వములలో భారతదేశానికి, హాలండుకు భేదములున్నాయి. అయితే మాంటిసరీ విద్యాలయం నడపడంలో ఒక పద్ధతియున్నది. అది నేర్చుకొని భారతీయాధ్యాపకులు, భారతీయ పరిస్థితుల కనుగుణ్యముగ నా పద్ధతినిమార్చి అవలంబింపవచ్చు. యూరప్‌లో ఒక నారీమణి అధ్యాపకురాలైతే 'ఆమె ఆ మరణాంతము' అలాగే అధ్యాపకురాలుగానే

ఉండిపోతుంది; ఏమంటే ఆమెకు పుష్కలంగా జీవనానికి భృతి ఇస్తారు. భారతదేశంలో అట్లాగాదు. కొన్నాళ్లు ఉపాధ్యాయినిగాఉండి, పెళ్లిచేసుకొని, పిల్లలకని సంసారం చేసుకొంటూ ఆ ఉపాధ్యాయినీ వృత్తి వదిలేస్తుంది. ఇది భారతదేశానికి ప్రాణాంతకమైన విషయం. ఉపాధ్యాయినులకు సుఖజీవనం గడపడానికి భారతదేశంలో ఏర్పాట్లు జరగాలి. మాంటిసరీ స్కూళ్లు 'ధనవంతుల బిడ్డల' కంటారు; తప్పు; ధనవంతులబిడ్డ దాదిచేతుల్లో పెరుగుతుంది. పేదలబిడ్డ సహజంగా తల్లిచేతిలో పెరుగుతుంది. కాబట్టి గ్రహణశక్తిహెచ్చు. ధనవంతుల ఇల్లాండ్రెందరో నన్ను తమ బిడ్డలకు తెలివి కలిగేట్లు చేయమని కోరియున్నారు. ఈ దేశంలో బిడ్డను 6 వ ఏట బళ్లో వేస్తారు. అప్పటికల్లా బిడ్డకు సహజంగా నేర్చుకొనే ఉత్సాహం హరించిపోతుంది. నా పద్ధతిక్రింద 2½ సం॥ల వయస్సునుండే శిశువును బడిలో చేర్చుకొని బోధజరుపుతారు. ఆరేండ్లు వచ్చేసరికి ఆ బాలునికి ఒక విషయంచెప్తే తెలుసుకొనేశక్తి కలుగుతుంది. చదువడం వ్రాయడం వస్తుంది; జాగ్రఫీ లెఖ్ఖలు తెలుస్తాయి. అన్నిటికీ మించినదేమంటే,-వాళ్లమ్మను చికాకు పెట్టడానికి బదులు గృహకృత్యాల్లో ఆమెకు సహాయపడుతాడు.

గతమూడునాలుగేండ్లు వివిధ ప్రదేశాలలో జరిగిన మతకలహాల్లో స్త్రీలు పలువురు చెరబెట్టబడినారు. వారిని తిరిగి స్వగృహాలకు చేర్చే సదుపాయం చేస్తున్న సంఘంలో ముఖ్యపాత్ర వహించినవారు శ్రీమతి సుచేతా కృప్లానీగారు. ఆమె ఇటీవల చెన్నపురివచ్చినప్పుడీ విషయమై ఈ విధంగా చెప్పియున్నది:—

ఈ కార్యము అనుకున్నంత సంతృప్తికరంగా జరిగినదని చెప్పలేను. పరస్పరం చెరబట్టినవారిలో పలువురింకా మా చేతికందలేదు. అందినవారైనా - పాకీస్థాన్‌లో ఉన్నవారు సిగ్గుచేత తిరిగి ఇండ్లకు రావడానికి ఖిడియపడి రామంటున్నారు; తమకుపట్టిన దుర్గతిలో మరిగి పోతామంటున్నారు. ఇటు ఇండియాలో చెరబడ్డ ముస్లీం స్త్రీల సంగతీ అట్లాగే ఉన్నది; వాళ్లనూ స్వంత ఇండ్లకు పొండిఅంటే ఎంతచెప్పినా వినడంలేదు. ఈ విషయంలో ఉభయప్రభుత్వాలున్నూ సంపూర్ణ సహాయం చేస్తున్నారు; కాని భారత ప్రభుత్వము చెప్పినంతా చేసిచూపినా, పాకీస్థానము మాత్రము పైకబుర్లేతప్ప తృణమెత్తు సహాయం చేయలేదు. పాకీస్థానమున చెరబడ్డ స్త్రీలు పలువురు ఇప్పటికీ నికృష్టజీవనం గడుపుచున్నారు. వారిలో చాలామంది-వ్యభిచార గృహాలలో బ్రతుకుతున్నారు.

ఇటీవలనే ఢిల్లీనగరంలో. భారత దేశపు క్షయవ్యాధినివారక సంఘముయొక్క 11-వ సాంవత్సరిక సమావేశము జరిగినది. దానికి భారతయూనియన్ ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ గారధ్యక్షత వహించి ఇట్లుపన్యసించారు:—

క్షయవ్యాధివల్ల - భారతదేశంలో నిమిషానికి ఒక ప్రాణి హరించి పోతున్నదని ఊహించుటకే భయోత్పాతముగానున్నది. ఆ వ్యాధి ఏమీ దయాదాక్షిణ్యాలు, తారతమ్యాలు లేకుండా-బలిగొంటున్నది; అందులోనూ ముఖ్యంగా దేశీయ నిధినిక్షేపాలు, మూలాధారాలు అయిన యువకుల నాహుతి గొంటున్నది. ఇది భయంకరమైన వేగంతో వ్యాపించిపోతున్నది. దీని నన్నివిధాలా, అన్ని ముఖాలా ఎదుర్కొని నశింపుచేయవలసి యున్నది.

ఇది వరలో రష్యాయందు భారతప్రభుత్వపు రాయబారిగానుండి ఇప్పుడు అమెరికాలో భారతరాయబారిగా నియమింపబడి వెళ్లుచున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారు ప్రయాణసమయమున ఇట్లుచెప్పి యున్నారు:—

రెండు సం॥ల క్రిందట నేనమెరికా వెళ్లియున్నాను. 27 రాష్ట్రాలలో ఉపన్యసించి ఉన్నాను. వేలాది జన మాసభలకు హాజరైనారు; వారెంతో స్నేహ సౌహార్ద్రాలు చూపారు. వారిలో పలువురితో ఉపయుక్తమైన స్నేహం చేసుకొని ఉన్నాను. మున్ముందుగా అమెరికా వెళ్లగానే నేచేయవలసిన సంతోష ప్రదమగు పనులు పాతస్నేహాలు గట్టిపరుచుకోవడం; క్రొత్తస్నేహాల నలవరచుకోవడం. దీనివల్ల ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక రంగాలలో నీరెండు దేశాలున్నూ అత్యంత సామీప్యము కాగలవు. నేనీపదవి కేర్పాటైనా ననేసరికి అక్కడినుంచీ మిత్రులెందరో అభివందనా లంపినారు. స్వతంత్ర భారతదేశము శైశవాస్థలో ఉన్నది. అది సామాన్యమానవునికి ఆప్యాయమైనది కావలెనంటే, ఆర్థికంగా, పారిశ్రామికంగా, వ్యావసాయకంగా ఈ దేశాభివృద్ధి కల్గుటకు చేయదగినదంతా చేయాలి. ముఖ్యంగా నాపని అక్కడ మన అవసరాలను అమెరికాలో అధికారులకు, పారిశ్రామికులకు తెలియజేయడమే.

(266-వ పుట తరువాయి)

పడిపోయి వెనుకపడ్డాడు. గుంపులో తోసుకొని కొంతదూరంపోతేగాని మళ్లీ తమవారిని కలుసుకోలేక పోయాడు.

ప్రేక్షకుల సౌకర్యార్థమై ఎన్నో ఏర్పాట్లుచేశారు. ప్రదర్శనశాలలో భాషాంతరీకరించి చెప్పేవారి నేర్పరచారు. ప్రదర్శనముల వివరించేవారిని నిల్పారు. వీళ్లు బసచేయడానికి క్లబ్బులు మొదలైనవన్ని అమర్చారు. అక్కడ అన్ని సౌకర్యాలు ఏర్పాటుచేశారు. వీరికి అన్ని సంగతులు తెలియను గైడ్లు ప్రచురించారు. వీటి నెవ్వరైనా కొన దలుచుకుంటే ధరవరులు మాట్లాడుకొను, వస్తువుల గట్టివోడు పరీక్షింపను, జట్టీలు ఇవ్వను, డెలివరీ తేదీలు నిర్ణయించుకోను అన్ని ఏర్పాట్లు జరిగాయి. ఇందుకు వర్తక సంఘాలన్నీ తోడ్పడ్డాయి. ఈ ప్రదర్శనంలో ప్రభువు, పారిశ్రామికుడు, వర్తకుడు ముగ్గురుకలిసి పోయినా రనవచ్చు.

బ్రిటిష్ వస్తువులంటే ఎప్పుడూ నాణ్యానికి పేరే. వానిలో వస్త్రములు ముఖ్యమైనవి. ఆపైన తోలు వస్తువులు. నగలు, వెండి సామాను ఆతర్వాతవి.

ఈ ప్రదర్శనాలు. 30 సం||లకు పైగా జరుగుతున్నాయి. ఇది 29 ప్రదర్శనం. యుద్ధకాలంలో జరుగలేదు



లేడీ యాస్టర్

కాబోలు) దీని ముఖ్యోద్దేశమేమి ? ఎగుమతులు వృద్ధిచేసుకోవడం, సరుకులు ఎగుమతిచేస్తేనే వారికి బ్రతుకు; లేకపోతేలేదు. యుద్ధకాలంలో అన్ని కష్టంగా అనుభవించారు. యుద్ధానంతరం పుష్కలంగా ఉత్పత్తి చేస్తూకూడా-తాము పొదుపుగా వాడుకుంటూ విదేశాల కెగుమతి విస్తారంగా చేస్తున్నారు. చాలుపోడుగునా సమర్థులను దేశదేశాలకంపి వారి వారి అవసరాలను పరిశీలింపించి అందుకనుగుణ్యంగా క్రొత్తవస్తువులు తయారుచేసి ఈ ప్రదర్శనాలలో ఆకర్షణీయంగా ప్రదర్శించి విదేశాల మార్కెట్టులు నింపుతున్నారు. ఒక్క మోటార్లువాళ్లు ఉత్పత్తిచేసే వానిలో ముప్పాతికవంతున విదేశాల కమ్ముతున్నారట.

ఈ ప్రదర్శనం - మే నెలలో జరుగుతున్నది. మనకిది వేసవిగాని వారికి నిజంగా వసంతమే. అది కూడా విదేశస్థుల నాకర్షిస్తున్నది. ఈ వసంతంలో జనపద స్థలాలలో విహరించడం ఎంతో ఆనందదాయకంగా ఉంటుందట.

యాస్టర్‌సతి అమెరికాలో పుట్టినది, ఇంగ్లాండులో మెట్టినది. ఆమెగత ఎలక్షన్‌లవరకు పార్లమెంటు సభ్యురాలు; అనగా 1919 మొ|| 1945 వరకు. ఆ పదవి కామెయే మొదటిది. బ్రిటిష్ రాజకీయాలలో ఆమె చాల ప్రాముఖ్యత వహించినది. ఆమె కన్సర్వేటివ్‌పార్టీ. అందులో హేమాహేమీలైన హోర్, లిన్లిత్‌గో, ఇర్విన్ ప్రభృతులంతా ఆమె ఇంట నిత్య అతిధులు. ఈ కూటమిని 'క్లైవెడన్ సెట్' అనేవారు. కన్సర్వేటివ్ పార్టీవారు ముఖ్యమైన పార్టీపథకాలన్నీ ఆమె ఇంటి ప్రాంగణంలో యోచించి నిర్ణయించేవారుట. ఆమె యెంతో చాకచక్యంగల స్త్రీ. గత ఎన్నికలలో వారిపార్టీకి బలం తగ్గింది. ఆమె ఓడిపోయింది. ఊరకున్నదా? గత సంవత్సరము కాబోలు - అమెరికావెళ్లి ప్రచారంచేసి వచ్చినది. ఈ సం||ము ఈ ప్రదర్శనానికి ముందు - ప్రపంచంలో స్త్రీ లందరిని ప్రబోధిస్తూ ఒక గొప్ప విజ్ఞప్తిచేసింది. వారందరినీ ఈప్రదర్శనంవచ్చిచూడమని ఆహ్వానించినది. మగవాళ్లు అమ్మేవాళ్లే; కొనడంమనపని-అని సాటి ఆడవాళ్ల నందరినీ హుషారాయించింది. బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీస్ వారావిజ్ఞప్తిని గతమాసంలోనే పంపారుగాని సకాలంలో రానందున-ప్రచురింపలేక పోయినాము-అందులో పైన ఇచ్చిన వివరాలు చాలవరకామె పొందుపరచినది.

ఇలాంటి కులీన కుటుంబాలలోని కులస్త్రీలుకూడా - దేశరాజకీయాలలో, సాంఘిక పారిశ్రామిక, వాణిజ్యాలలో ఎంత శ్రద్ధ వహిస్తారో - దానికీమెయే సాక్షి. మనదేశంలోను - స్వతంత్ర రాజకీయాలు వృద్ధిఅయ్యేకొద్దీ ఇట్టి వారెందరో ఉద్భవిస్తారు.



# చైత్ర ప్రకృతి

శ్రీ కాంతం ఆదిమూర్తిగారు

చిగురుటాకులు మెసవుచుఁ బొగరుగలిగి
పికసమూహంబు గొంతెత్తి ప్రియముతోడ
పాడదొడగెను కమ్మని పాటలెల్ల
మహిత పంచమస్వరమున మంజుగతిని.

తీగబోడియు ప్రియునకు స్వాగతంబు
నిచ్చువేడుక నిగనిగల్ హెచ్చుమీఱు
చిగురు వలువను ధరియించి నగుచువచ్చు
పగది గనుపించె మొగ్గల పరువ మమర.

మధుర మకరందమును గ్రోలికొదమతేంట్లు
రొదలుసేయుచు దిరిగె సమ్మోదము మీర
మధువు ద్రావిన మత్తుచేఁ గుదురులేక
చెదరుచుండిన మానవ శ్రేణి పోల్కి.

కలిమి లేములు కష్టసుఖాలు మనకు
శాశ్వతంబులు గావను సరణిదోప
మోడులైయున్న వృక్షముల్ చూడజూడ
బత్రపుష్పఫలాల సంపదనుఁ గొనియె.

గాఢసంతాప వేద నాక్రాంత మగుచు
గ్రుంగి కృశియించు నరు నంతరంగ మందు
రాణ దోచెడు నాశాంకు రంబులనగ
నెండచేఁ గ్రాగు చెట్లలో నిండె జిగురు.

# ఈ వ్యక్తి ఎవరు?

### ఉగాది బహుమానము

ఇప్పటివరకు గతసంచికలో బొమ్మను గూర్చిన ప్రశ్నకు జవాబులు పంపినవారు ఈక్రింది విధముగ జవాబులిచ్చిరి.

1. డాక్టరు కే. యన్. కేసరిగారు అని 1 పి. కోదండరావు (విశాఖపట్నం) 2 దేశిరాజు జయలక్ష్మి (బాపట్ల) 3 కాం. వేం రంగారావు (బరహంపురం) 4 కే. సుబ్బలక్ష్మమ్మ (పెదపులివరం) 5 విజయరామరాజు (డిటో) గార్లు.

2. డాక్టరు కేసరిగారు అని వ్రాసి కొట్టివేసి కందాడై శ్రీనివాసన్ అని- బి. వెంకటేశ్వరరావు (కపిలేశ్వరపురం) గారు.

3. శ్రీ కేసరిగారి పుత్రిక శ్రీమతి శారదగారు అని - జి. లీల (ఏలూరు) 2 లక్ష్మీబాయి గార్లు.

4. శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీ సాహెబా వారు (మద్రాసు గవర్నరు సతి)-అని - యం. శ్రీరాములు (జంషెడ్ పురం) గారు.

5. శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాజా వారిదని - బసవరాజు బాపాయమ్మ (ఈదర) గారు.

6. శ్రీమతి గుమ్మడిచర్ల (దల) దుర్గాబాయమ్మగారు అని - శ్రీమతి బులుసు పార్వతిబాయిగారు ఉండిగ్రామంనుండి.

7. సింప్సన్ కంపెనీలో (మద్రాసు) పనిచేసే - జై. సి. సుబ్బయ్యగారు అని - శ్రీ. పి. కోటయ్య యాదవ (కరవది) గార్లు

8. శ్రీమతి త్యాగసేవాసక్త గానకళా విశారద, విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నంగారిది-అని. 1 సుగుణా నటరాజన్ (ఎగ్మూర్, మద్రాసు) 2 చె. పార్వతమ్మ (ఎగ్మూర్.) 3 ప్రతాప లక్ష్మీజయ ప్రదాదేవిగారు (వట్లూరు) 4 యం. లక్ష్మీకుమారీదేవి (కాకినాడ) 5 అన్నం శ్రీరంజని (మద్రాసు) - 6 సి. రామలక్ష్మమ్మ - (గుత్తి) 7 నిమ్మగడ్డ సీతారామమ్మ (భీమవరం) 8 వి. సీతారామన్ (నెల్లూరు) 9 ఈమని మణియమ్మ (విద్యార్థిని, శ్రీకాకుళము) 10 జి. శారదాదేవి (ఏలూరు) 11 కోటికలపూడి లక్ష్మీపతి (రాజమండ్రి) గార్లు.

నిజమున కీబొమ్మ - శ్రీ బెంగుళూరి నాగరత్నమ్మ గారిదే, నాటి శ్రీ శ్రీ శ్రీ మైసూరు మహారాజా వారి మన్ననలందుచుండిన చిన్ననాటి చిత్రము. కావున కడపటి 11 గురు చెప్పినది సరి. వారిలో ప్రప్రథమమున అనగా 15-4-49 నాడే వ్రాసిపంపినది శ్రీమతి సుగుణా నటరాజన్ గారు; వీరు మద్రాసు ఆలిండియా రేడియో స్టేషన్ లో స్టేషన్ డైరెక్టరుగారికి పర్సనల్ అసిస్టెంటుగానున్న నటరాజన్ గారిభార్య.

అయితే-మద్రాసులోనున్న వారికి 15-4-49 నసే త్వరగా వ్రాయుటకున్న అవకాశములు హెచ్చు. కాని వట్లూరు (పశ్చిమగోదావరి), కాకినాడ, భీమవరం, గుత్తి ప్రాంతముల వారికి పత్రిక చేరుట ఆలస్యము. కావున-అట్టి అవకాశములేదు. అయినను- 3, 4, 6, 7 - నెంబర్ల వారు ఆయా ప్రదేశములనుండి 17-4-49 నకే వ్రాసి పంపిరి. అవకాశమునగల తారతమ్యమెంచినచో- ఈ నలుగురును త్వరగా వ్రాసినట్లే.

కావున విరోధి ఉగాది బహుమానమును—

శ్రీమతులు సగుణా నటరాజన్, ప్రతాప లక్ష్మీజయ ప్రదాదేవి, యం. లక్ష్మీ కుమారీదేవి, సి. రామలక్ష్మమ్మ, నిమ్మగడ్డ సీతారామమ్మ గార్లకు - 5 గురికి ఇచ్చుటకు నిర్ణయింపబడినది.

బహుమానం : "గృహలక్ష్మి" వెనుకటి సంపుటములలో ఒక్కొక్కరికొక్క సం॥ ముది, త్వరలో రైల్వే పార్శిలుగా పంపబడును.

(గృ॥సం)

# సంపాదకీయములు

## ఆహారపదార్థములలో కల్తీ

ఇతరదేశాలలో మంచిపదార్థముఅమ్మి ఒకకానీ ఎక్కువసంపాదించడం వ్యాపారమనిపించుకుంటున్నది. మనదేశములోనో కల్తీపదార్థమునమ్మి - ఆ కల్తీవల్ల వచ్చేధరతేడాను సంపాదించడం వ్యాపారలక్షణమైనది. ఉభయులు లాభకాంక్షులే. ఉభయులు కొనుగోలుధరకు అమ్మకంధరకుగల తేడా లాభంతో తృప్తిపడడంలేదు. అయితే ఇతరదేశీయులు మంచిదిచ్చి ఒకకానీ హెచ్చుతీసుకుంటే మనవాళ్లు చెడ్డపదార్థమిచ్చి ఒకకానీ రాబడుతున్నారు. మంచిపదార్థము తిన్నవాడు ఒకకానీపోతేపోయిందని సంతోషిస్తున్నాడు. చెడ్డపదార్థంకొన్నవాడు, ఇంతడబ్బిచ్చుకున్నా కల్తీపదార్థము తినవలసివస్తున్నదే అని తిట్టుకుంటున్నాడు. గిండీలో ప్రభుత్వపరిశోధనాలయంలోఉన్న శాస్త్రజ్ఞుడు మనరాష్ట్రంలో ముఖ్యంగా కలితీ జరుగుతున్నది - పాలల్లో అంటాడు. తాను పరిశోధించినవానిలో 100-కి 60 వంతులు కల్తీఅన్నాడు. టెండరు కంట్రాక్టుమీద ఎన్నిపరీక్షలకో ఆ ఆఫీసర్ల కండ్లఎదుట పిండియిచ్చేపాలు-156 శాంపిల్ కేసులు చూస్తే అందు 58 నీళ్లపాలు. అక్కడకలిపి నిలువడుంచేమందులు సగానికిసగం సరిగాలేవట. నేయి, వెన్న మంచినూనె, కొబ్బరినూనె, పసుపు, కాఫీ అన్నీకల్తీయే. కొబ్బరినూనెలో తెల్లచమురు కలుపుతున్నారు. అది లోపలికిపుచ్చుకున్నా జబ్బే; పైకిరాచుకున్నా అంతే. పసుపులో పచ్చని సీసపుపొడి కలుపుతున్నారు; అది విషం. కాఫీలో ఇప్పపిండి, ఈతపిక్కలు వేయించిన ధాన్యాలు వీటన్నిటిపొడీ కలుస్తున్నది. కాఫీబిళ్లలని అమ్మబడేవానిలో అసలు కాఫీతాలూకు వస్తువులే నేలేదట. ఇక షాపులపెట్టెలో సామాను తెస్తే - వాటినిండాదుమ్ము. పప్పులలో, బియ్యంలో రాళ్లు. ఇట్లా ఏదిచూచినా కలితీయే. ఈ దుర్గుణం ఎట్లాతగ్గుతుంది? కేవలం వర్తకుని అనీ లాభంలేదు. జాతిలోనే పరివర్తనరావాలి. ఒకకానీ హెచ్చైనా శుభ్రమైన సరుకుకొని - కొద్దిగానే భోంచేసి, ఆరోగ్యం కాపాడుకుంటే డాక్టరుబిల్లుల ఖర్చుతగ్గుతుంది. ఒంట్లో జవసత్త్వములుండడంచేత ఎక్కువపనిచేసి ఎక్కువసంపాదించుకోవచ్చు. కనీసం కులాసాగాఉండవచ్చు. అనేభావన చిన్నప్పటినుండి బిడ్డలకుమప్పవలె- ఒకరినిమోసంచేసి, అనగా చెడ్డవస్తువుఅమ్మి డబ్బుసంపాదించడంకంటే,—ఒకడికి మంచిసరుకమ్మి మెప్పించి ధనంసంపాదించడం న్యాయం-ధర్మం-ఉత్తమం అనే నీతికూడా చిన్నప్పుడే పిల్లలకు తలకెక్కాలి - అంటే ఈ విధంగా నూతనజాతిని సృష్టించవలసినభారం తల్లిమీదఉన్నది.

## ఆహారసమస్య

ఆహారధాన్యములు తక్కువపండుతున్నాయని దేశమంతటా రేషన్ పద్ధతిపెట్టారు. హెచ్చుపండించాలని ప్రభుత్వాలు ప్రచారంచేస్తున్నవి; రైతులకు ధనసహాయమూ చేస్తున్నవి. కాని ఆహారసమస్య అట్లాగే ఉన్నది. నిజానికి ఆహారసమస్య - గృహలక్ష్మి సమస్య. ఇంటికెవరైనా అతిథిఅభ్యాగతులుగాని, బంధుమిత్రులుగానివస్తే తట్టిముట్టాడడం గృహలక్ష్మికెంత అసహ్యమో చికాకో చెప్పనక్కరలేదు. 8 ఔన్సుల రేషన్లో తానేమితింటుంది; భర్త, బిడ్డలకేమిపెట్టతుంది; వచ్చినవారికేమి వండి, వడ్డిస్తుంది? ప్రభుత్వం మాత్రం చాలా తంటాలుపడుతున్నమాట వాస్తవం. ఆహారానికి ధాన్యంతోపాటు ఇతరపదార్థాలుకనిపెట్టవలెనని వారు తంటాలు పడుచున్నారు. అందుకుగాను యూనియన్ ప్రభుత్వంలో ఆహారమంత్రిన్నీ, శాంతి రామమూర్తిపంతులు, లాలాశ్రీరామ్‌గార్లున్నూ ఒక ఉపసంఘంగా నియమింపబడ్డారు. ఇటీవల ప్రధాని నెహ్రూ తాను గోధుమపిండిలో కూడా - చిలగడదుంపల (గెనుసుగడ్డ) పొడికల్పుకొని తింటున్నాను-అని చెప్పారు. ఇప్పుడు సర్వేసర్వత్ర ఎందుకు యత్నించి చూడరాదని—పైకమిటీవారు పరీక్షింపనున్నారట. చిలగడదుంపలు మనప్రాంతంలోకూడా పేదసాదలుకాల్చుకొని, ఉడకబెట్టుకొని తింటున్నారు. కాని అవి వాతంచేస్తవిఅని, అజీర్ణంచేసి కడుపునొప్పివస్తుందిఅని అలవాటులేనివారు, అశక్తులుఅంటారు. కేవలం

శాస్త్రరీత్యా చూచి ఇట్టి ఆహారాలు నిర్ణయించక - ప్రత్యక్షంగా వాటిఫలితాలు మన్నా తెలిసి, వీలైతే వాటికి విరుగుడు కూడా చెప్తే - ప్రజలు సులువుగా అవలంబింపవచ్చు. ఇటీవల మద్రాసులో 'సెమిలోనా' అని ఒకపదార్థము ఇవ్వడమారంభించారు. మొదట్లో అది పూనూకగా ఉండేది. రెండుమూడువారాలయ్యే సరికి కేవలం పిండిరాసాగింది. ఆ రవ ఉడకపెడితే కాకితాలంటించుకొనే జిగురు. ఇక ఆ పిండి జావే. రొట్టెచేస్తే ఒకరకంగా కాలిస్తే తెలుపు; బాగా కాల్చిస్తే మాడడం. అది గోధుమో, మొక్కజొన్నో రెంటికలయికో తెలియలేదు. ఇవన్నీ ఇల్లాలికి అశాంతికి కారణాలు; కాని ఇది ఎన్నడుతీరునో ఎవరూ చెప్పలేకున్నారు.

### శ్రీమతి రాజకిషోరీభాటియా బహుమానము.

శ్రీమతి రాజకిషోరీభాటియా—ఇటీవల మన రాష్ట్రవైద్యశాఖోన్నతాధికారిగానుండిన భాటియాగారి ధర్మపత్ని. ఆమె గతసం॥న అకాలమరణమొందెను. భాటియాగారు ఆమె మధురస్మృతి శోకచిహ్న మేర్పరుపదలచిరి కాబోలు. మద్రాసుప్రభుత్వవారికి రు 1450-లను విరాళమిచ్చినారు. ప్రతి సం॥మున్నూ జూన్ పరీక్షలోను, డిశంబరుపరీక్షలోను నర్సు (దాది) వృత్తికి అవసరమైన విద్యచదివి ప్రథమురాలుగా ఉత్తీర్ణులైనవారికి చెరియొక బహుమానమిమ్మని నిర్ణయించిరి. శ్రీమతి భాటియాసతి కొంతకాలము వ్యాధి గ్రస్తురాలైయుండి గతించినది. ఆమె తుదికాలమున దాదులసేవనపేక్షించిన అవస్థ ఆయునకు మరుపురానిదై యుండవలయును. ఈ విధముగా తన ధర్మపత్నికి స్మారకచిహ్నము నెలకొల్పినారు. అనుకూలపతుల లక్షణమది. అట్టిలక్షణమే తాజమహల్ నిర్మాణమునకు మూలమైనది. అట్టిలక్షణమే పలుపురచే గొప్ప గొప్ప సంస్థలనెలకొల్పజేసినది. ఈ మూలమున రాష్ట్రమందలి నర్సువృత్తికి ప్రోత్సాహము కల్పించినందులకు శ్రీ కల్నల్ భాటియాగారికి మా ధన్యవాదములు.

---



గుంటూరులో విరోధి ఉగాదినాడు శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ కృతమైన 'ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారి జీవితచరిత్ర' అనేబుర్రకథను ఆమెకు కృతిసమర్పణ మొనర్చిన సందర్భము.

(సభ ఏర్పాటుచేసినవారు-శ్రీ మహాలక్ష్మీ పఠనమందిరము, మహిళాసంఘము,)

వరుసగా (కుడినుండి ఎడమకు) శ్రీమతి కొండా పార్వతీదేవిగారు బి. ఎ. లక్ష్మీబాయమ్మగారు, వరలక్ష్మమ్మగారు, బొడ్డుపల్లి బాలాత్రిపురసుందరమ్మగారు.




కాంగ్రెసు సేవ (సింహపురి సంక్షిప్తచరిత్ర) గ్రంధకర్త: శ్రీమాన్ కోమాండూరి పార్థసారధి అయ్యంగారు: కౌశికాశ్రమం, రంగనాయకులపేట, నెల్లూరు: వెల రు. 2-4-0లు.

మా చిరకాలమిత్రులు శ్రీ కోమాండూరి పార్థసారధిఅయ్యంగారు చిరకాలపు ప్రజాసేవకులు; ప్రజ్ఞాధురీణులు, పరిశీలనాసమర్థులు. సుమారొక అర్థశతాబ్దముగా నెల్లూరుమండలమున వారికి తెలియక ఒక్క ప్రజాహితకర కార్యమును జరిగియుండదు. అట్టివారే ఈ గ్రంధరచనకు సమర్థులు. మాసిపోయిన 'వీరవిక్రమ సింహపురి' యను నామధేయము మొదలు నెల్లూరిపూర్వగాధ లెత్తుకొని - నేటివరకు నెల్లూరిమండలమున జరిగిన యావజ్జాతీయ కార్యక్రమపు వృత్తాంతమును సంక్షిప్తపరచియేవ్రాసిరి. 200 పుటలకు మించిన గ్రంధమిది. నిజమునకింతగ్రంధమయ్యేడిది కాదు. అయితే విశాలహృదయులగు శ్రీమానయ్యంగార్లు - నెల్లూరి నీరుత్రాగినవారు, నెల్లూరి గాలిసోకినవారు, - ఎక్కడెక్కడి మహనీయులనో ఇందు ప్రస్తావనకు తెచ్చినారు. నెల్లూరిసాహచర్య, సంపర్క, సంబంధములుగల్గి 'విస్మృతులైన అగ్నిదగ్ధ అనగ్నిదగ్ధ, అయం పిండుల' నెందరినో ఇందు సంస్మరించిన శ్రీ పార్థసారధి అయ్యంగారి ఔదార్యమెన్నదగినది. ఉత్తరసర్కారులవారు నెల్లూరివారినిచూచు చిన్నచూపు అచ్చటచ్చట ప్రస్తావింపబడి కఠినముగా విమర్శింపబడినది. అగుగాక! నెల్లూరివారు సమర్థులైనను, వారికిగల 'బేఫర్వా', 'భరువసా' మున్నగు నైజములుకూడ కొంత ఇందుకు తోడ్పడినవేమో? మొత్తమునకు గ్రంధము కులాసాగా చదువ యోగ్యముగనున్నది. వీరికృషి లాభసాటి కాకున్న మానె, నష్టకరము కాలేదని భావింతుము.

అమృతఫలమ్. గ్రంధకర్త : విద్వాన్ వైద్య మిత్ర సుంకర శివరామయ్య చౌదరిగారు. దొరకుచోటు బాపూజీ గ్రంధమండలి, ఘంటా వెంకయ్య చౌదరిగారు, గుడివాడ, కృష్ణాజిల్లా : వెల రు 0-8-0.

శ్రీ చౌదరిగారు ఉసిరికకాయ ప్రాశస్త్యాన్నిగూర్చి 38 పుటల ఈ చిన్ని గ్రంధం తెలుగున వచనంలో వ్రాశారు. స్వయంగా విద్వాన్; అధికస్య వైద్య మిత్రులు. ప్రాచీన ఆయుర్వేద వైద్యుల గ్రంధాలలో నుండి ముఖ్యమైన శ్లోకాలు ఉదహరిస్తు ఉసిరికకాయ, ఆహార పదార్థంగా, మందువస్తువుగా - ఎంతటి ప్రాశస్త్యమైనదో పూర్తిగా వివరించారు. ఆధునిక శాస్త్రజ్ఞులునూ ఈ ఉసిరికకాయ గొప్పను విశేషంగా వివరించి పొగిడారు. దానినిన్నీ కొద్దిగా ప్రస్తావించి యున్నారు. మనము సామాన్యంగా లెఖచేయని ఒక చిన్నకాయనుగూర్చి ఇంత విశేషమును తెల్పిన శ్రీ చౌదరిగారు ధన్యులు. ఇట్లే వీరు ఇతర సామాన్య ఫలాలనుగూర్చికూడా పరిశోధించివ్రాస్తే. తెలుగువారికింకా ఎంతో సేవచేసిన వారవుతారు.

శ్రీ ఆరోగ్యసుధ - సంపాదకులు ఆండ్రి శేషగిరిరావు బి. ఏ, ఆంధ్ర రంగారావు ఎల్. ఐ. యంగార్లు; కార్యాలయం, మదరాసు. 7. సాలుచందా రు 3-0-0

ఇది 1949 సం|| జనవరిలో ప్రారంభమైన మాస పత్రిక. ప్రత్యేకంగా ఆరోగ్య విషయమై నడుప

బడు పత్రికల కిదియే ప్రారంభమని చెప్పవచ్చును. ఇందులో శ్రీ వేటూరి శంకరశాస్త్రి, వై. సూర్యనారాయణరావు, వల్లూరి సుబ్బారావు ప్రభృతులైన డాక్టర్లు వ్రాసిన ఉత్తమ వ్యాసములలరారుచున్నవి. నిరంతరము తన ఇంటి ఆరోగ్య పరిస్థితుల సంరక్షింపవలసిన గృహలక్ష్మికిట్టి పత్రిక మహోపకారి. ఆరోగ్య విషయమై ఆమెను నిత్యమూ ఎదుర్కొనే ధర్మసందేహాలను తీర్చగల వ్యాసాలనుకూడా ఇందుకొన్ని ప్రచురించుచుందురని తలంచెదము.

**పాడిపంటలు: విరోధి సంవత్సరాది సంచిక 1949 : మద్రాసు వ్యవసాయశాఖా డైరెక్టరు ఆఫీసు, ట్రిప్లికేనుపోస్టు 412, మద్రాసు. సాలుచందా రు 0-12-0.**

ఇది మద్రాసు వ్యవసాయ శాఖవారు మద్రాసు రాష్ట్రములో తెలుగు వ్యవసాయకుల సౌకర్యార్థం తెలుగులో ప్రచురించుచున్న మాసపత్రిక. వ్యవసాయకులకు అవసరమైన అనేకమైన, ముఖ్యవిషయములిందులో ప్రతివారమున్ను ప్రచురింపబడుచుండును. ఈ ఉగాది సంచికయందు అధికముగా వ్యాసములు ప్రకటింపబడినవి. "కుటీరపరిశ్రమల అవకాశము-రాయలసీమ" అన్న వ్యాసము-సర్వేసర్వత్రా, ముఖ్యముగా అనాథ స్త్రీలకు బ్రతుకుతెరువు చూపగలదు.- ఇంత విలువైన పత్రిక ఇంత చౌకగా దొరకుట చాల సంతోషింప దగినది. ప్రతి పల్లెలో నిది ప్రవేశింపదగును. (కచటతప)

## శ్రీ విరోధినామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠ మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | సో | చ. 19-24 పూషా. 50-23 ది 13-48 పంచమీతిథి. |
| | 17 | మం | పం. 19-31 ఉషా. 52-52 ది 11-13 షష్ఠితిథి; గ్రహజన్మయోగం. |
| | 18 | బు | ష. 20-55 శ్ర 56 33 ది 3-29. |
| | 19 | గు | స. 23-30 ధ 60-0 శూన్యతిథిః. |
| | 20 | శు | అ. 27-12 ధం. 7-7 దివ 20-7 అష్టమీతిథిః. దగ్ధయోగం. |
| | 21 | శ | న. 31-43 శత 7-7 ది 24-8. |
| | 22 | ఆ | ద. 36-44 పూభా 13-26 రావి 7-56 మిథునాయనం. |
| మే నెల | 23 | సో | ఏ. 41-49 ఉభా 20-1 రావి 21-0 సర్వేషామేకాదశీ. దగ్ధయోగం |
| | 24 | మం | ద్వా. 46-33 రే 26-22 పూర్ణజలరాశా. |
| | 25 | బు | త్ర. 50-31 అశ్వ 32-9 రావి 25-56 |
| | 26 | గు | చతు. 53-32 భ 37-1 శేషః 2-25 మాసశివరాత్రి. |
| | 27 | శు | ● 55-20 కృ 40-47 దివ 8-54 అన్వాధానం. |

### జ్యేష్ఠ మాసము

| | | | |
|---|---|---|---|
| | 28 | శ | శుద్ధపాడ్యమి 55-50 రో 43-19 రావి 25-23 కర్తరీత్యాగం. |
| 1949-వ సం॥ | 29 | ఆ | వి. 55-7 మృ 44-35 కల్కిజయంతి. చంద్రోదయం. |
| | 30 | సో | త. 53-10 ఆర్ద్ర 44-39 ది 5-36. |
| | 31 | మ | చ. 50-7 పున 43-39 ది 14-9 భౌమచతుః గౌరిపూజా. |
| | 1 | బు | పం. 46-5 పుష్య 41-38 ది 2-59. |
| | 2 | గు | ష. 41-16 ఆశ్రే 38-49 దివ 12-8 అగస్త్యాస్తమయం. |
| | 3 | శు | స. 35-50 మఘ 35-24 దివ 7-6 రంధ్రయోగం. |
| | 4 | శ | అ. 29-56 పూఫ 31-31 |
| | 5 | ఆ | న. 23-48 ఉ.ఫ. 27-23 రావి 14-35 తిథిద్వయం. |
| | 6 | సో | ద. 17-37 హ. 23-13 రా 9-36 ఏకాదశీతిథిః. రామేశ్వరప్రతిష్ఠా. |
| జూన్ నెల | 7 | మం | ఏ. 11-35 చి 19-23 చరణే పూర్ణజలరాశా. కూర్మజయంతి. |
| | 8 | బు | ద్వా. 5-57 స్వా 15-41 ది 28-59 రామలక్ష్మణద్వాదశి. |
| | 9 | గు | త్ర. 0-50 చతుర్థ 56-36 విశా. 12-42. |
| | 10 | శు | ○ పౌ. 52-57 అనూ. 10-26 దివ 24-8 |
| | 11 | శ | బ పాడ్యమి. 50-30 జ్యేష్ఠ 9-7. |
| | 12 | ఆ | విదియ 49-14 మూ 8-53 దివ 4 54. |
| | 13 | సో | త. 49-13 పూషా. 9-50 దివ 30-34. |
| | 14 | మం | చ. 50-28 ఉషా. 12-2 దివ 22-36 వడశీతిపుణ్యకాలం. |
| | 15 | బు | పం. 52-57 శ్ర 15-28 దివ 26-13. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

కొలది ప్రతులుమాత్రమేకలవు | త్వరపడుడు

# బిల్వ, వేప

బిల్వ వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము, సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితములమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కె. యన్. కేసరి | ప్రతి 1-కి 0-12-0

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట :: మద్రాసు

# ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈదిగున స్థలములలో ఏజంట్లు కావలయును

తెనాలి; సోంపేట; పాలకొండ; బొబ్బిలి; సాలూరు; కందుకూరు; నంద్యాల; గిద్దలూరు; అనకాపల్లి; కంభం; నర్సారావుపేట; పాలకొల్లు; అమలాపురం; జగ్గయ్యపేట; రాజోలు; ఆముదాలవలస; కైకలూరు; గునుపూరు; మండపేట; ధర్మవరం; సూళ్లూరుపేట; గూడూరు; బుచ్చిరెడ్డిపాళెం; కోట, వేటపాలెము; చేబ్రోలు; సామర్లకోట; పెద్దాపురము; కొల్లూరు; భట్టిప్రోలు; రేపల్లె; కాళహస్తి; తుని; వెంకటగిరి; పాకాల; ద్రోణాచలము; ప్రొద్దుటూరు; హాస్‌పేట; జబ్బల్‌పూరు; ఖమ్మంమెట్టు; వరంగల్లు; మహబూబాబాద్; గుత్తి; మండపేట; పోలవరం; ధర్మవరం; తాడిపత్రి.

వివరములకు :

'గృహలక్ష్మి' కార్యాలయము,

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు.

REGD. NO. M. 4793

*An ideal Combination of Beauty-Aids!*









# రాజా
# స్నో

హేరాయిల్
కస్తూరిసోపు
బ్రిలియన్‌టైన్







**MANYAM & CO.,** Bangalore – Madras
Madura – Bombay

FAS-

REGD. NO. M. 4793

*An ideal Combination of Beauty-Aids!*









రాజా
స్నో
హేరాయిల్
కస్తూరిసోపు
బ్రిలియన్‌టైన్







**MANYAM & CO.,** Bangalore – Madras
Madura – Bombay

FAS-

REGD. NO. M. 4793

*An ideal Combination of Beauty-Aids!*









రాజా
స్నో
హేరాయిల్
కస్తూరిసోపు
బ్రిలియన్‌టైన్







MANYAM & CO., Bangalore – Madras
Madura – Bombay